

స్థలజలజం

—ఫొటో : పి. సి. ఎమ్. ఈశ్వరబాబు.

సంవత్సర చందా
రు. 12-0-0
విడిప్రతిక 4 అ.

# ఆంధ్రపత్రిక

సచిత్రవారపత్రిక

Founder : K. NAGESWARA RAO

సంపుటము 49
సంచిక 16
**21.12-55**

మన్మథ మార్గశిర శుద్ధ సప్తమి బుధవారం



నాగార్జునసాగర్ శంకుస్థాపన మహోత్సవ సభావేదికకు పోయేమార్గంలో నిర్మించిన సింహద్వారం (అలంకరణ శ్రీ గుర్రం మల్లయ్య).

# విషయానుక్రమణిక




తెలుగుసీమలో మరో 34 లక్షల ఎకరాలను సస్యశ్యామలంచేసే 'నాగార్జునసాగర్'కు శంకుస్థాపన చేస్తున్న భారతప్రధాని నెహ్రూ.

# ఆంధ్రాభ్యుదయ హేతువు నాగార్జున సేతువు

"అంతరించిన ప్రాచీన ప్రాభవానికీ, అవతరించే నవీన వైభవానికీ ఉజ్జ్వలచిహ్నం ఈ నాగార్జున సాగర్ నిర్మాణం" అని భారత ప్రధాని జవహర్లాల్ నెహ్రూ వేలాదిజనుల హర్షకోలాహలంమధ్య నాగార్జున సాగర్ శంకుస్థాపనోత్సవం చేస్తూ అన్నారు. ఈ నెల 10 వ తేదీన జరిగిన ఈమహోత్సవం ఆంధ్రుల చరిత్రలో స్వర్ణాక్షరాలతో లిఖించదగిన ఘట్టం. 34 లక్షల ఎకరాలను సస్యశ్యామలం చేయగల ఈ మహానిర్మాణానికి 122 కోట్ల రూపాయల ఖర్చు, దాదాపు 10 సంవత్సరాలకాలం పడుతుంది. 12 లక్షల టన్నుల ఆహారధాన్యాలు అదనంగా పండుతాయి. ఇక్కడకట్టే విద్యుత్కేంద్రం 75 వేల కిలోవాట్ల శక్తిని ఉత్పత్తి చేస్తుంది.

ఇక్కడ సిమెంటు, రాయితోకట్టే ఆనకట్టభాగం భారతదేశంలోని ఇతర ఆనకట్టలన్నిటికంటే పెద్దది. ప్రపంచంలో దీనిది ద్వితీయస్థానం.

ఆంధ్ర, హైదరాబాదు రాష్ట్రాలు రెంటికీ ప్రవహించే కాలవలకు మొత్తం 33 వేల క్యూసెక్కులనీరు సరఫరా అవుతుంది. దక్షిణపు కాలవకు 21 వేల క్యూసెక్కులనీరు లభ్యమవుతుంది. దీని పొడవు 276 మైళ్లు.

"ఈమనోహర ప్రదేశాన్ని చూస్తుంటే నామనస్సు ఇటు గతంవైపూ, అటు అనాగతంవైపూ పరుగులుతీస్తోంది. ఈ ప్రదేశములో మనపూర్వులు మనకోసం అద్భుత కార్యాలు చేశారు. రెండువేలఏళ్ళ తరవాత మనం ఈనాడు భావితరాలవారికోసం అద్భుత కార్యాలు చేయబోతున్నాము. రెండు వేల ఏళ్ళక్రితం చైనా, జపాన్, బర్మా, థాయ్‌లెండ్, సింహళాలనుండి నౌకలు ఈ కృష్ణాతీరానికి వచ్చేవి. ఎందుకని? ఇక్కడొక మహానగరం, ఒకగొప్ప విశ్వవిద్యాలయం ఆరోజుల్లో వర్ధిల్లాయి. ఇక్కడ ఇక్ష్వాకురాజులు పాలించారు. ఆచార్య నాగార్జునుడు ఇక్కడ బౌద్ధధర్మాన్ని ప్రవర్తింపజేశాడు. ఇక్కడనుండి భారతీయ నాగరికత దేశదేశాలకు విస్తరించింది. తిరిగి ఈరోజున మనం స్వతంత్రులమై, నూతన కల్యాణయాత్రలో ఇరుగు పొరుగు వారితో కలిసి ముందంజవేస్తున్నాము. ఈ నాగార్జున సాగరానికి ఇప్పుడు నేను పునాదిరాయిని స్థాపించడం అతి పవిత్రకార్యంగా ఎంచుతున్నాను. భారత ప్రజాలయానికే యిది పునాదిరాయి. ఈనాడు భారతవర్షమంతటా మనం నిర్మిస్తున్న కొత్తరకం ఆలయాలకు ఇది చిహ్నం" అని ప్రధాని నెహ్రూ శంకుస్థాపన సందర్భంలో ఉపన్యసించారు.

"ఈ ప్రాంతాన్ని పూర్వం 'విజయపురి' అని పిలిచేవారు. ఇది ఇక్ష్వాకు సార్వభౌముల ఏలుబడిలో ఉండేది. 'విజయపురి' అందమైన పదం. ఈ పదాన్ని మనం నేడు కూడా సార్థకం చేయబోతున్నాము. మనం సాధించబోయే విజయం ఏదేశం మీదనూ, ప్రజలమీదనూ కాదు; దారిద్ర్యం మీద, దుఃఖంమీద, వ్యాధిబాధలమీద. ఇక్కడ మరొకనగరం ఉద్భవించాలని నా కోరిక. ఆ నగరానికి మళ్లీ విజయపురి అనే సార్థక నామం పెట్టాలని నా కోరిక," అని నెహ్రూ అన్నారు. ★

నేడే చూడండి



ప్రమోద ఒ శ్రీ ఫిలిమ్సువారి,

# పసుపు కుంకుమ

దర్శకత్వం. జి. డి. జోషి

స్టూడియో. ప్రకాశ్.

డిస్ట్రిబ్యూటర్లు: సీడెడ్: వసంత అండ్ మహాత్మ పిక్చర్సు, గుంతకల్లు.
ఆంధ్ర: ఫిలిం ఆర్ట్సు పిక్చర్స్, గాంధీనగర్, విజయవాడ.
నైజాం: చమేరియా టాకీ డిస్ట్రిబ్యూటర్సు, సికిందరాబాద్.

# రత్నకుండలాలు

పి. గణపతిశాస్త్రి

"నాయనా! ఉదంకా! నేనొక రాజకార్యంమీద బయలుదేరి వెళ్లుతున్నానుగాని, ఇంటిలో నేను లేనప్పు డేలోపము రాకుండా నీవు జాగ్రత్తగా కనిపెట్టి చూడాలి సుమా!"

అని ప్రయాణ సన్నాహమై బయలుదేరి వెళుతున్న పైలాచార్యుడు శిష్యునితో చెప్పినాడు.

ఉదంకుడుపాధ్యాయుడింటిలో లేడనే లోపమేమీ లేకుండా బహు శ్రద్ధాళువై ఆయన గృహావసరాలన్నీ పరిశీలిస్తూ జాగ్రత్తగా శుశ్రూష చేసినాడు.

మరికొంత కాలానికి ఆచార్యు డాశ్రమానికి తిరిగివచ్చినాడు. శిష్యుని శ్రద్ధాభక్తులకెంతో మురిసిపోయినాడు.

ఉదంకుని విద్యాభ్యాసం ముగియగానే ఆచార్యుడొకనాడుదగ్గిరికిపిలిచి: "ఉదంకా! నీ విద్యాభ్యాసం సమాప్తమైనది. ధర్మం తూచా తప్పకుండా నీవు నాకు శుశ్రూష చేసినావు. నీవింక స్వగృహానికి వెళ్ళవచ్చును. నీకు సమస్త శ్రేయస్సులు సిద్ధించుగాక!" అన్నాడు.

ఉదంకుడీ మాటలకెంతో సంతోషించి, "ఆచార్యా! తమ అభీప్సితమేదైనా నెరవేర్చి మరీ స్వగృహానికి తిరిగి వెళ్లాలని అనుకుంటున్నాను. తమ అభీష్టం ఆనతీయవలసింది." అని అనేక విధాలుగా ప్రాధేయపడ్డాడు.

దానిమీద పైలుడు: "నాయనా! నీవు నన్నేక విధాలుగా నిర్బంధిస్తున్నావు. సరే! గురుపత్నిదగ్గిరికివెళ్లి ఆమె కేదైనా కోరిక ఉన్నట్టయితే అది నెరవేర్చి స్వగృహానికి తిరిగి వెళ్లిపో!" అని బదులు చెప్పాడు.

ఉదంకుడుపాధ్యాయ పత్ని సన్నిధికి వెళ్లి ఆమెతో ఇలాగ విన్నవించినాడు:

"అమ్మా! ఉపాధ్యాయులు స్వగృహానికి మరలిపోవడానికి నాకు అనుమతి దయచేసినారు. ఏదైనా మీ అభీప్సితం ఉంటే అది నెరవేర్చి, ఆ విధంగా ఆచార్యుని ఋణం తీర్చుకుని మరీ వెళ్ళిపోదామని సంకల్పించినాను. ఇందుచేత మీ కోరిక ఏదైనావుంటే ఆనతీయవలసింది"

ఆ మాటపై పైలపత్ని అతనితో ఇలాగ చెప్పినది:

"నేటికి నాలుగవ రోజున నేనొక పుణ్యవ్రతం చెయ్యాలని సంకల్పించినాను. ఆనాడు పౌష్యమహారాజు భార్య పెట్టుకునే రత్నకుండలాలు ధరించి, బ్రాహ్మణ సమారాధన చెయ్యాలని నా సంకల్పం. పౌష్యునిదగ్గిరికి వెళ్ళి ఆయనభార్య రత్నకుండలాలడిగి తీసుకురావలసినది. ఈ ప్రయత్నంలో నీకు సమస్త శ్రేయస్సులు సమకూరుగాక!"

ఉదంకుడు 'సరే' అని ఆమెదగ్గిర సెలవు తీసుకొని పౌష్యుని పట్టణానికి బయలుదేరినాడు.

మార్గంలో అతనికొక గొప్ప వృషభంపై కూర్చున్న మహాపురుషుడొకడు ప్రత్యక్షమైనాడు. ఆ మహాపురుషు డుదంకునితో 'నీవీవృషభం గోమయం కొంచెం భక్షించవలసినది' అని ఆజ్ఞాపించినాడు.

దీనికి ఉదంకుడు సుతరాము ఇష్టపడలేదు.

"ఉదంకా! నీవెంతమాత్రము సందేహించ నవసరంలేదు. మీ ఆచార్యుడే ఒకప్పుడీ గోమయం కొంచెం లోపలికి పుచ్చుకొన్నాడే" అన్నాడా మహాపురుషుడు.

ఉదంకుడు దాని కంగీకరించి, ఆ వృషభం గోమయము, గోమూత్రము కొంచెం లోపలికి పుచ్చుకొని, తిరిగి పౌష్య



'నాగార్జున సాగర్' వద్ద జరిగిన బహిరంగ సభాదృశ్యం.

## ★ రత్న కుండలాలు ★

మహారాజు పట్టణానికి ప్రయాణమైనాడు.

పిమ్మట పౌష్యుని దర్శనం చేసుకొని, అతనన్నేక విధాలుగా ఆశీర్వదించి "మహారాజా! నేనొక కార్యార్థినై తమ సందర్శనానికి వచ్చినాను." అన్నాడు.

"నేను పౌష్యుడనుగదా! నన్ను మీరేమైనా అర్థించవచ్చునే!" అన్నాడు పౌష్యుడు.

"గురు కార్యార్థినై మహారాజ్ఞి ధరించే మాణిక్య కుండలాలకోసం మీ సన్నిధికి వచ్చినాను. అవి నాకిప్పించవలసింది."

"మహారాణి అంతఃపురంలో ఉన్నది. ఆమె నడిగి ఆ కుండలాలు తీసుకోవచ్చును."

ఉదంకు డటుపిమ్మట అంతఃపురములోనికి వెళ్ళినాడు. కాని ఎంత వెదికినా అతని కక్కడ ఆ రాణి కనిపించనేలేదు.

ఉదంకుడు తిరిగి వచ్చి పౌష్యునితో "మహారాజా! అనృతమాడి నన్నీవిధంగా వంచించడం మీకు న్యాయంకాదు. మహారాణి అంతఃపురంలో ఎక్కడా కనిపించనేలేదు." అన్నాడు.

పౌష్యుడిలా బదులు చెప్పినాడు: "కాదు! ఆమె అంతఃపురంలోనే ఉన్నది. నీవేమైనా కారణంవల్ల మైలపడిపోయినావేమో! బాగా జ్ఞాపకంచేసుకో! ఆమె మహా పతివ్రత. మైలపడిపోయినవారుగాని, అపరిశుద్ధులుగాని ఆమెను సందర్శించలేరు."

"అవును! నేనొక అశుచి పదార్థం లోపలికి పుచ్చుకుని ఆచమించడం మానివేసినాను."

"అయితే పరిశుద్ధుడవై తిరిగి ఆమె దర్శనానికి వెళ్ళిపో!"

ఉదంకుడు వెంటనే తూర్పుదిక్కుగా తిరిగి కాళ్లుచేతులు శుభ్రంగా కడుక్కొని, హృదయంలోకి వెళ్లేవరకు పరిశుద్ధోదకం ఆచమించి శుచియై అంతఃపురంలోనికి వెళ్ళినాడు! వెళ్ళగానే అతనికి మహారాజ్ఞి ప్రత్యక్షమైనది!

ఆమె ఉదంకుని చూడగానే లేచి నిలుచుని అభివాదంచేసి "సుస్వాగతం! తమ కేమి కావలెనో తెలియచెయ్యవలసింది." అన్నది.

"గురుకార్యార్థినై మీరు ధరించిన కుండలాలర్థించడం కోసం వచ్చినాను." ఆమె 'సత్పాత్రం దొరికిందిగదా!' అని చాలా సంతోషించి చెవులనున్న కుండలాలు రెండు తీసి అతనిచేతిలో ఉంచి "నాగరాజు తక్షకుడీ కుండలాలకోసం చాలా తాపత్రయ పడుతున్నాడు. ఇవి బహు భద్రంగా సంరక్షించుకోవలసినది....ఉదంకా! ఇవి జాగ్రత్తగా తీసుకు వెళ్ళవలెను సుమా!" అన్నది.

అనంతరం ఉదంకు డంతఃపురాన్నించి మహారాజుసన్నిధికి వచ్చి తన ఆనందం అంతా ఆయనకు తెలియజేసినాడు.

పౌష్యుడతనితో "మహాత్మా! నీవంటి సత్పాత్రం చిరకాలానికిగాని లభించనేరదు. నీవు సుగుణాల కొలవాలమైన అతిథివి. నేను శ్రాద్ధవిధి ఆచరించాలని సంకల్పించినాను. నాకోరిక నెరవేర్చాలని కోరుతున్నాను." అన్నాడు.

"నేను శీఘ్రంగా తిరిగి వచ్చివేస్తున్నానని మాట ఇచ్చి ఉన్నాను. కాబట్టి, వండినంత వరకు అయిన వంటకాలతోనే శ్రాద్ధవిధి నడిపించవలసింది!"

పౌష్యుడలాగే అని అంతవరకు అయిన వంటకాలతో అతనికి భోజనం పెట్టినాడు. ఉదంకునికా అన్నంలో తల వెంట్రుకలు కనిపించినవి. అన్నం కూడా బాగా చల్లారిపోయినట్లే ఉన్నది. అతడది గ్రహించి, పౌష్యునితో "నీవు నాకు అశుచిగా ఉన్న అన్నం వడ్డింపజేసినావు. ఈ దోషంవల్ల

> "ఏరా తమ్ముడు ఆ మధ్య ఉద్యోగంకోసం చాలా సతమతమవుతూ వచ్చాడు ఇప్పుడేం చేస్తున్నాడు?"
>
> "ఏం లేదండి. వాడికి ఉద్యోగం దొరికింది."



"నాగార్జునకొండ యాత్ర" —చిత్రకారుడు: ముక్కపాటి కృష్ణమూర్తి

నీవు అంధుడవై పోతావు." అని శపించి నాడు.

"దోష మేమీ లేని అన్నాని కీవిధంగా వంకలు దిద్దుతున్నావు! కాబట్టి నీకు సంతానమే కలగకుండుగాక!" అని రాజు తిరిగి ఉదంకునికి శాపం ఇచ్చినాడు. అయితే ఉదంకు డతనికా అన్నంలో ఉన్న అపభ్రంశాలన్నీ వెంటనే ఎత్తి చూపించినాడు.

తల విరియబోసికొన్న ఒక స్త్రీ ఆ అన్నం వడ్డించినది. అందువల్లనే దానిలో తల వెండ్రుకలు కనిపించినవి. అన్నంకూడా కొంచెం చల్లారినది. రాజది గ్రహించుకొని, "మహాత్మా! నావల్ల అపరాధం జరిగిపోయింది. నన్ను క్షమించవలసినది నాకిచ్చిన శాపం ఉపసంహరించివెయ్యవలెను." అని అనేకవిధాలుగా ప్రాధేయపడినాడు.

ఉదంకుడు: "నేనన్న మాట ఎన్నడూ తప్పిపోదు. నా మాట ప్రకారం నీవు కొంతకాలంవరకు అంధుడవై పోతావు. కాని త్వరలోనే నీకు తిరిగీ దృష్టికలుగుతుంది. మరి నాకిచ్చిన శాపంకూడా ఉపసంహరించవలసిందని కోరుతున్నాను."

పౌష్యుడు: శాపం ఉపసంహరించడానికి నాకు శక్తిలేదు. ఇంతవరకున్న నా కోపం ఉపశమించ నేలేదు. నీవిన్నూ విన లేదా!

'బ్రాహ్మణుని హృదయం కేవలం నవనీతం. అయితే వాక్కులు వాడికత్తులు; క్షత్రియునిలో ఈ రెండు విపరీతములు! అతని వాక్కు నవనీతం; హృదయం పదునైన కరవాలం.' ఇందువల్లనే నా శాపం మళ్ళించలేను ఇక నీ దారిని నీవు వెళ్ళవచ్చును."

ఉదంకుడు: "అన్నం అశుచిగానే ఉన్నదని నీవంగీకరించి, నేనిచ్చిన శాపం మళ్ళించవలిసిందని ప్రాధేయపడ్డావు. అంతకుపూర్వం అన్యాయంగా అన్నం అశుచిగా ఉన్నదని నిందించినాననే కారణంచేత నాకు శాపం ఇచ్చి ఉన్నావు! అన్నంలో దోషం ఉన్నదని నీవే అంగీకరించినావే. ఇందుచేత నీ శాపం నన్ను బాధింపనేరదు."

అని చెప్పి ఉదంకుడా కుండలాలు తీసుకొని, అక్కడినించి బయలుదేరినాడు.

అతనికి మార్గంలో ఒక నగ్నక్షపణకుడు కనిపించినాడు. అతని మూర్తి మాటిమాటికి దృశ్యాదృశ్యంగా మారిపోతున్నది.

ఉదంకుడా కుండలాలు రెండు ఒడ్డున పెట్టి ఒక తటాకంలో స్నానం చెయ్యడానికి దిగినాడు.

ఈలోగా ఆ క్షపణకుడక్కడికి వచ్చి, ఆ కుండలాలు రెండు చేజిక్కించుకొని, తొందరతొందరగా పరుగెత్తుకు పోయినాడు.

ఉదంకుడది చూచి వెంటనే అతని వెన

రోమియో: మీ టెలిఫోన్ నెంబరు చెప్పండి. అవసర మాట్లాడాలి.

జూలియట్: టెలిఫోన్ గైడులో ఉందండి.

రోమియో: అయితే మీ నాన్నగారి పేరు చెప్పండి. అందులో చూసుకుంటాను.

జూలియట్: అది కూడా గైడులోనే ఉందండి.

"మీ చిన్ననాటి అభీష్టాలు ఏవైనా సిద్ధించాయా?"

"ఒక్కటే తీరింది. చిన్నపుడు మా మేష్టారు నాజుట్టు పట్టుకుని తలగుంజి తన్నేవారు. అప్పుడు, జుట్టు లేకుండా పోవాలని రోజూ కోరుకునేవాణ్ణి."



# రత్న కుండలాలు



కాశే పరుగెత్తుకువెళ్లి పట్టుకున్నాడు. శ్రమణకుడా రూపం విడిచివేసి తక్షక రూపంధరించి క్షణంలో అక్కడ ఏర్పడిన భూవివరంలో దూరి నాగలోకంలో ఉన్న తన భవనానికి వెళ్ళిపోయినాడు! ఉదంకుడు కూడా అదే మార్గంలో అతన్ననుసరించి వెళ్ళి క్షణంలో నాగలోకం చేరుకొన్నాడు.

పిమ్మట ఉదంకుడా నాగలోకవాసులైన నాగరాజుల నందరినీ హృదయాలు ద్రవించిపోయేటట్టు వేయివిధాలా స్తుతించినాడు. ఎన్ని ప్రకారాల స్తోత్రాలు చేసినా తిరిగీ అతనిలా కుండలాలతనికి లభించనేలేదు!

అక్కడ అతనికొక మహా అద్భుతం ప్రత్యక్షమైనది! ఇరువురు స్త్రీలు రెండు మగ్గాలకు దగ్గరగా కూర్చుని అదేపనిగా వస్త్రాలు నేస్తున్నారు. వారు నేసే దారాలు కొన్ని నల్లనివి, కొన్ని తెల్లనివీను. అక్కడనే అతనికొక మహాశ్చర్యకరమైన చక్రం కూడా కనిపించినది. దానికి పన్నెండాకులు! ఆరుగురు కుమారులా చక్రం మెల్లిగా గిరగిర తిప్పుతున్నారు. ఆ కుమారులకు సమీపంలో అశ్వారూఢుడైన పురుషుడొకడున్నాడు. వారంతా అతని నేత్రాలకెంతో మనోజ్ఞంగా కనిపించినారు. ఉదంకుడు వారి నందరినీ వివిధములైన మంత్రాలతో స్తుతించినాడు.

ఆ అశ్వారూఢుడైనపురుషు డతనిస్తోత్రాలకు మిక్కిలి ఆనందించి "నీ స్తోత్రాలతో నాకానందం కలిగింది. నీకేమి కావలెనో కోరుకో!" అన్నాడు.

"ఈ నాగులంతా నావశమైపోవాలి! ఇదే నా కోరిక!" అన్నాడుదంకుడు.

"ఈ అశ్వం చెవిలో గట్టిగా ఊదితే నీకోరిక నెరవేరగలదు!"

ఉదంకుడా పురుషుడు చెప్పినట్టే చేసినాడు. వెంటనే ఆ అశ్వం ముక్కుపుటాలలోనించి పెద్ద పెద్ద పొగలు, సెగలు అగ్నిజ్వాలలు బయలుదేరినవి. అవి క్షణంలో నాగలోకంఅంతటా అలుముకుపోయాయి.

తక్షకుడా అగ్ని జ్వాలలు అవ్వీ చూచి, గజగజ వణికిపోయి, ఆ కుండలాలు రెండూ తీసుకువచ్చి "నీ కుండలాలు నీవు తీసుకు పోవయ్యా!" అని ఉదంకుని హస్తంలో ఉంచినాడు.

ఉదంకు డవి స్వీకరించి "నే నీ కుండలా లుపాధ్యాయ పత్నికి నాటికే తీసుకుపోవాలే! చాలా దూరం వచ్చివేసినానే! ఎలాగ!" అని ఎన్నో విధాలుగా ఆందోళన పడినాడు.

ఈ విధంగా చింతానిమగ్నుడైన ఉదంకునితో ఆ పురుషుడు "ఉదంకా! నీవేమీ భయపడనక్కరలేదు! ఈ గుర్రంమీద ఎక్కి కూర్చున్నావంటే కనురెప్పపాటులో ఇది నిన్ను స్వగృహానికి తీసుకుపోగలదులే!" అని అభయం ఇచ్చినాడు.

ఉదంకుడా గుర్రం ఎక్కి ఒక్క నిమిషంలో ఉపాధ్యాయుని గృహం చేరుకొన్నాడు.

ఈలోగా పైల పత్ని స్నానంచేసి తలకట్టు ఆరబెట్టుకుంటూ "ఉదంకుడింకా ఆ కుండలాలు తీసుకుని రానేలేదు. అతనికి శాపం ఇవ్వవలెను!" అనుకొంటున్నది.

ఇంతలోనే ఉదంకుడక్కడికి చేరుకొని ఆమెకు పాదాభివందనంచేసి కుండలాలర్పించినాడు.

ఆమె అతన్నెంతో ఆప్యాయంగా ఆదరించి "వత్సా, ఒక్క క్షణం ఆలస్యం చేసి ఉంటే నేను నిన్నీపాటికి శపించి ఉందును! దానికేమి!—సమయానికి రావడంవల్ల నీవేది కోరుకొన్నా అది వెంటనే నెరవేరాలని వరం ఇస్తున్నాను!" అన్నది.

అనంతరం ఉదంకు డుపాధ్యాయునికి కూడా అభివాదం చేసినాడు. ఆయన ఆప్యాయంగా అతన్ని దగ్గిర కూర్చోబెట్టుకొని "అయితే ఏం నాయనా! ఇంతగా ఆలస్యం చేసినావు!" అని ప్రశ్నించినాడు. ఉదంకు డీలా సమాధానం చెప్పినాడు:

"నాగరాజు తక్షకుడు నాకనేకవిధాల విఘ్నాలు కలిగించినాడు. అందువల్ల నాగలోకం వెళ్ళవలసి వచ్చినది. అక్కడ నాకు వస్త్రాలు నేస్తూన్న స్త్రీలిద్దరు కనిపించినారు. వారు నేసే దారాలు తెల్లనివీ, నల్లనివీను. అక్కడనే పన్నెండాకుల చక్రం కూడా ఒకటి కనిపించినది. ఆరుగురు పిన్నవారది తిప్పుతున్నారు. ఇంతేకాదు. అక్కడనే ఒక పెద్ద అశ్వము, దానిపైన ఒక ఆజానుబాహువైన పురుషుడు కూడా ఉన్నారు. ఆయనకూడా ఎవరో తెలియలేదు. మొట్టమొదట నామార్గంలో వృషభం మీద కూర్చున్న మరి ఒక మహా పురుషుడు కూడా ప్రత్యక్షమైనాడు. ఆ పురుషుడా వృషభం గోమయం భక్షించవలసిందని ఆజ్ఞాపించినాడు. అంతేకాక మీరే ఒకప్పుడది భక్షించినారని కూడా చెప్పినాడు. నేనది కొంచెం లోపలికి పుచ్చుకొన్నాను. దయ ఉంచి ఈ అద్భుతాలను గురించి వివరంగా తెలియజెయ్యవలసిందని కోరుతున్నాను."

అతనికి ఉపాధ్యాయు డీ విధంగా సమాధానం ఇచ్చినాడు:

ఆ స్త్రీలిద్దరిలో ఒకరి పేరు విధాత. రెండవ స్త్రీ ధాత. నల్లనివీ తెల్లనివీ దారాలు చూచినానని అన్నావు. అవి రాత్రింబగళ్లు! ఆ చక్రం సంవత్సరము. ఆ పన్నెండాకులు పన్నెండు నెలలూ. ఆ ఆరుగురు కుమారులు ఆరు ఋతువులు. వారా సంవత్సర చక్రం తిప్పుతున్నారు. అక్కడ ఉన్న పురుషుడు పర్జన్యుడు. అతని అశ్వం అగ్నిదేవుడు. నీవు దారిలో చూచిన వృషభం ఐరావతుడనే నాగరాజు. దానిపైనున్నవాడు మహేంద్రుడు. నీవు భక్షించిన గోమయం మరేమీ కాదు. సాక్షాత్తు అమృతమే! దానివల్ల నీకువచ్చిన ప్రత్యవాయమేమీ లేదు. ఆ నాగభవనంలో నామిత్రుడైన ఇంద్రుడే నివసిస్తున్నాడు. అతని అనుగ్రహంవల్లనే తిరిగి నీవీ కుండలాలు సంపాదింపగలిగినావు. నాయనా! నీవింక స్వగృహానికి వెళ్ళిపోవచ్చును. నీకు శుభం కలుగుగాక!"

పిమ్మట ఉదంకుడాచార్యునిదగ్గర సెలవు తీసుకుని స్వగృహానికి మరలిపోయినాడు. ★

"నిన్న సాయంత్రం నేను బీచికెళ్దామన్నా. మా ఆవిడ సినిమాకి వెళదామంది. చివరకి..."

"సినిమా బావుందా?"

* * *

"మీ తమ్ముడు పేట్రేగిపోతున్నాడు. నన్ను గురించి అడ్డమైనవి వాగుతున్నాడట. అన్నీ అబద్ధాలే."

"అబద్ధాలైతే ఇబ్బందేముంది. నిన్ను గురించి వాడు నిజం చెబితే ఈడ్చి లెంపకాయ కొట్టు. నేనేమీ అనుకోను."

# తప్పిపోయినాడు

"వయస్సు ఎనిమిది సంవత్సరములు. కుర్రాడు కొద్దిగా నలుపు. ఈడుకు తగ్గ ఎత్తుగా వుంటాడు. చొక్కా పై భాగంలో కొద్దిగా చిరిగివుంటుంది. కుర్రాడి పేరు వెంకటరమణ."

న్యూస్ పేపరు విప్పగానే 'తప్పిపోయినాడు' శీరిక క్రింద చదివాడు జోగారావు. కుర్రాడిని వెతికి తీసుకొచ్చినవారికి నూరు రూపాయల బహుమానం కూడా ఆ తండ్రి ప్రకటించాడు! క్రింద చిరునామా చూశాడు - తన వూరే! మొత్తంమీద తేలిన విషయం ఏమంటే - తన వూళ్ళోవుంటున్న నాగభూషణం అనే ఆయన చిన్నకొడుకు వెంకటరమణ తప్పిపోయాడు - వెదికి తీసుకొస్తే నాగభూషణంగారు నూరు రూపాయల రొఖ్ఖం చెల్లిస్తాడు!

జోగారావుకు వార్తా పత్రిక చూసే అలవాటు లేదు. ఎప్పుడన్నా - ఎవరన్నా కొంటే తను పక్కనవుంటే వోసారి తీసుకుని చూస్తాడు. అదన్నా ముందు ప్రకటనలు, ఆ తర్వాత వార్తలు. పత్రిక రెండో పేజీలో ఎడమచేతిపక్క పైభాగంలోవున్న ఈ 'తప్పిపోయినాడు' మీదికి జోగారావు కన్ను వెళ్ళింది! కుర్రాళ్లు ఇట్లా తప్పిపోవటం కొత్తకాదు. కుర్రాళ్ళే అన్నమాటేమిటి - పెద్దపెద్దవాళ్లే తప్పిపోతున్నట్టు చూస్తున్నాము. వీళ్ళెందుకిట్లా తప్పిపోతూవుంటారో జోగారావుకు అర్థం కాలేదు!

జోగారావు వార్తాపత్రికను జాగర్తగా దాని యజమానికి వప్పగించేసి, ఇంటి మొహం పట్టాడు. ఆ తర్వాత ఈ 'తప్పిపోయినాడు' గురించి అతను ఆలోచించనే లేదు!...

కాఫీ తాగి, సిగరెట్టు ముట్టించి, పొగ వదుల్తూ పెద్ద రోడ్లూ, చిన్న రోడ్లూ దాటి వోసందుగుండా పోతున్న జోగారావుకు ఓ కుర్రాడు ఏడుస్తూ కనిపించాడు. మొదట్లో ఆ ఏడుపు విని 'ఏదోలే' అనుకున్నాడు. తర్వాత ఆసందులో ఇంకెవ్వరూ మనుషులు లేనందువల్లా కుర్రాడు వంటరిగా ఏడుస్తుండటం వల్లా - వాడికేసి చూశాడు. ఛటాలునఅతనికి వార్తాపత్రికా, అందులోని 'తప్పిపోయినాడూ' గుర్తొచ్చింది! త్వరగా కుర్రాడిదగ్గిరికిపోయాడు -

"ఇదిగో అబ్బాయ్-ఏం ఏమిటి - ఎందుకట్లా ఏడుస్తున్నావ్?"

కుర్రాడు జవాబూ చెప్పలేదు-ఏడుపూ మానలేదు. ఈ కుర్రాడిలో జోగారావుకు తను పత్రికలో చదివిన లక్షణాలు కనిపించినై. వయస్సు ఎనిమిది సంవత్సరాలుంటుంది.

"మాడూ అబ్బాయ్-ఏడవకూడదు. మీ యింటికి పోదామా?" అన్నాడు.

కుర్రాడు ఏడుపు మానలేదు.

"నీ పేరేమిటోయ్?"

కుర్రాడు సమాధానం లేదు. లాలించాడు-బెదిరించాడు-ఎన్ని చేసినా వాడు ఏడుపు మానలేదు. జోగారావుకు చిన్న చిరాకు వంటిది కలిగింది. అడిగినదానికి సమాధానం ఇవ్వడేం?—

రావి కొండలరావు

"నీపేరు వెంకటరమణేనా?" అన్నాడు ఆఖరుకు. పత్రికలో పేరు గుర్తుకు తెచ్చుకుంటూ.

కుర్రాడు అవునన్నట్లు అనిపించింది జోగారావుకు. "పద- మీయింటికిపోదాం" అని చెయ్యి పట్టుకున్నాడు.

"వీధిలోకి పోయి అట్లా ఆ యేడు పేమిట్రా వెధవా - రా యింట్లోకి" అని వో కేక విన్నాడు జోగారావు. వెనక్కు చూశాడు- కుర్రాడితల్లి కాబోలు నించున్నది గుమ్మంలో. జోగారావు కుర్రాడిని తీసుకుని ఇంటిముందుకు పోయాడు.

"మీ అబ్బాయేనా యేమిటి? పాపం ఒకటే ఏడుపు!" అన్నాడుఆమెతో. ఆమె సమాధానం యివ్వలేదు. ఆ కుర్రాడిని లాక్కుని, రెండు చరిచి, లోపలకు తీసుకుపోయింది! తప్పిపోయిన కుర్రాడు వీడు కాదన్నమాట! ఐనా యేదో ఆశవంటిది జోగారావులో పనిచేసి - "మీ అబ్బాయి పేరు వెంకటరమణేనా?" అన్నాడు లోపలకుచూస్తూ. "కాదు వెళ్ళవయ్యా" అన్నదామె కటువుగా. జోగారావు నిట్టూర్చి వెనక్కు తిరిగాడు. పోతూవుంటే వినిపించింది - "పిల్లల్ని ఎత్తుకుపోయే దొంగవెధవలు" అని.

జోగారావుకు గుండె ఝల్లుమన్నది. ఆ ప్రాంతాన ఇహ ఉండటం శ్రేయస్కరం కాదని - త్వరత్వరగా నడిచి, సందుదాటి రోడ్డు దాటి - ఇల్లు చేరుకున్నాడు.

నాలుగు మెతుకులు నోట్లో వేసుకుని మంచంమీద వాలేసరికి - జోగారావుకు వార్తా పత్రికా - ఆ శీర్షికా గుర్తొచ్చినై. ఆలోచించసాగాడు - ఆయన పేరు నాగభూషణం - అబ్బాయి పేరు వెంకటరమణ - కుర్రాడు కొద్దిగా నలుపు - చొక్కా చిరిగిపోయివున్నది - వాళ్లది ఈ వూరే. అన్నిటికంటె గొప్ప విషయం కుర్రాణ్ని తెస్తే - నూరు రూపాయల బహుమానం! "నూరు రూపాయలు!" ఈ 'నూరూ' తన చేతిలో నాగభూషణం వూరికే పోస్తున్నట్టు అనిపించింది అతనికి. ఈ అబ్బాయిని వెతకటం అన్నది ఏమంత కష్టమయిన పని కాదు. కుర్రాడు ఎనిమిదేళ్ళవాడు. అంటే ఏ వూరో పారిపోయివుంటాడనే ఆలోచనే రాదు. బహుశా ఏ పక్క యింటికో ఆటకుపోయి అక్కడనుంచి ఎక్కడికో వెళ్లి ఉంటాడు - ఆ వెళ్ళటంలో దారి తప్పివుంటాడు! ఐనా ఎనిమిదేళ్లవాడు దారి తప్పటం ఏమిటి? - వాడికి మాటలొస్తే తన పేరూ, తన తండ్రి పేరూ కూడా శుభ్రంగా చెప్పగలడు! అంచాత కుర్రాడు తన యిష్టప్రకారమే తప్పిపోయి వుండాలి! ఇంట్లో ఎంచాతో తిడితేనో, కొడితేనో కుర్రాళ్లు ఇల్లు వదిలిపెట్టిపోతూ వుంటారు. ఊరవతల తోటల్లోనో-షాముగట్లమీదనో వుంటారు! అంతకు మినహా ఇంకేమీ చెయ్యలేరు. అటువంటి దేదో ఇప్పుడు జరిగి వుంటుంది. ఎనిమిదేళ్ల కుర్రాడు వొంటరిగా వూరు విడిచి ఏ రైలో ఎక్కటం అంటే సాధారణమయిన విషయంకాదు. దానికి రెండు కారణాలు కనిపిస్తున్నై. మొదటిది

# ★ తప్పిపోయినాడు ★

కుర్రాడికి సాహసం వుండదు - రెండోది కుర్రాడికి సాహసంవున్నా రైల్వేవాళ్ళు వూరుకోరు! బహుశా మరోటి జరిగివుంటే? ఎవడన్నా కుర్రాడిని ఎత్తుకుని పారిపోతే?- వెంకటరమణ ఒంటిమీద బంగారం గాని, వెండిగాని వున్నట్టు ఏమీ కనిపించదు. చొక్కా కూడా పైన చింపుకున్నాట్ట!— ఇటువంటి కుర్రాడిని ఎవడెత్తుకుపోతాడు?

ఆలోచించి ఆఖరుకు ఓ నిర్ణయానికి వచ్చాడు జోగారావు. ఏమిటంటే- వెంకటరమణ యెక్కడికీ పోడు - ఈ వూళ్లోనే వుంటాడు - ఒక్కసారి తను వూరిచుట్టూ ప్రదక్షిణంచేస్తే తప్పక దొరికిపోతాడు — అంటే కొన్నిగంటలుకొద్దీ శ్రమపడితే, నూరురూపాయలు వాటంతటవి వచ్చిపడతై. ఒక వేళ నాగభూషణంగారింటికివెళ్ళి ఇతర వివరాలుకూడా తెలుసుకుంటే తనకు వుపకరించవచ్చు అనుకొన్నాడు. కాని - అట్లా వెళ్ళటం బావుండదేమో! "మీ అబ్బాయిని వెతికి తెస్తాను" అంటే - ఆయన తనను మరోలాగా భావించి బహుమానం ఎగెయ్యవచ్చును. తను శ్రమపడి వెంకటరమణను వెతికి వప్పజెప్పటంవేరు- వాళ్ళింటికి వెళ్ళి మిగిలిన వివరాలు తెలుసుకుని - వాటినిబట్టి కుర్రాడిని వెతకటం వేరు! మొదటిదాంట్లో ఉన్నంతగొప్పతనం రెండోదాంట్లో వుండదు అదీగాక "ఆ వివరాలన్నీ ఇస్తే నువ్వేతీసుకు రావాలా ఏమిటి?" అని ఆయనంటే? — ఎందుకంటాడూ - ఇదేమన్నా పరీక్ష?— ఐనా తనంతటతను తిరిగి వెంకటరమణను పట్టుకోవాలి - నూరూ పుచ్చుకోవాలి!

జోగారావు ఛటాలున లేచి, మొహం కడుక్కుని బట్టలేసుకుని బయల్దేరాడు. ఎండ మాడుస్తున్నది. ఇటువంటి యెండలో తను ఇదివరకు తిరిగాడా? తిరిగాడు. ఐతే యీ తిరగటంలో అతనికి యేదో 'సాధించబోతున్నాను' అనే గొప్పతనం కనిపించింది. రోడ్లూ, సందులూ దాటి వూరవతలకు చేరుకున్నాడు. వెంకటరమణ ఇక్కడే ఈ ప్రాంతంలోనే వుంటాడని అతని నమ్మకం. దూరంగా ఏదో బస్సు పోతున్న శబ్దం మినహా అంతా నిశ్శబ్దంగా వున్నది. ఈ నిశ్శబ్దవాతావరణంలో ఎక్కడో వెంకటరమణ నిద్రపోతూ వుండాలి. రోడ్డు దిగి తోటల్లోకి దారి తీశాడు. ఆ తోటల్లో చల్లగా వుంది. తోటలన్నీ తిరిగాడు - చెట్లకిందా, మీదా చూశాడు - గడ్డితోపులన్నీ గాలించాడు! ఎక్కడా ఏమీ కనిపించలేదు. ఇంకా తిరిగాడు - ఒకచోట ఎనిమిదేళ్లకుర్రాడు - సరిగ్గా ఎనిమిదేళ్ళవాడు కనుపించాడు! వాడికి చొక్కాలేదు - నల్లగా వున్నాడు. చిన్నలాగూ, చేతిలో వో బెత్తం మినహా ఇంకేం లేవు.

"వెంకటరమణా!" అన్నాడు దగ్గిరికి పోతూ.

ఆ కుర్రాడు బిత్తరపోయి అటూ యిటూ చూడసాగాడు.

వీడు వెంకటరమణే—చొక్కా ఎక్కడో పారేసి వుంటాడు.

"ఏం ఇక్కడున్నావ్? పోదాం పద" అన్నాడు నికచ్చిగా.

"ఎక్కడికి బాబూ?" అనడిగాడు కుర్రాడుభయంతో.

## మూలకారణం

"వారం రోజులుగా నిద్ర పట్టడంలేదండి"

డాక్టర్: దానికి మూల కారణం ఏదో కనుక్కుని, దాన్ని నిర్మూలించాలి.

రోగి: మా పక్కవాటాలో ఆయనకి ఒక్కడే పిల్లాడండి.

## గడుసు కావాలి

"నాకు ఐదు రూపాయలు బాకీఅన్న సంగతి అప్పుడే మర్చిపోయావా?"

"అప్పుడే ఎలా మర్చిపోమ్మంటావ్ ... కొంచెం గడుసు కావాలి."

"మీయింటికే"

"మాయింటికా? ఎందుకూ?"

"ఎందుకేమిటి - మీ నాన్నగారు నీకోసం బెంగపెట్టుకుంటూవుంటే"

"ఆఁ - నాన్నగారా? నాకెవరూ లేరే!"

కోతకోతా జేమో ననిపించింది జోగారావుకు. ఐనా కుర్రాడికి ఇంతకోత ఎట్లా వస్తుంది? -

"నీ కెవరూ లేరూ? మీ నాన్న పేరు?"

"నాకు తెలీదు."

"నీ పేరు?"

"చిన్నోంకడు"

జోగారావు వొక్కసారిగా నేలమీద కూలబడ్డాడు!

"ఏం చేస్తున్నావు నువ్విక్కడ?"

"గొర్రెల్ని కాసుకుంటున్నాను బాబూ!"

"ఏవీ?"

కుర్రాడు దూరంగా చూపించాడు. నిజమే - గొర్రెలు కనిపించినై!......

జోగారావు లేచాడు. లేవటానికి శక్తి వచ్చింది. పడిపోకుండా శరీరాన్ని బిగించుకుని నిటారుగా నించున్నాడు!....

దాహం వేసింది...

"నీళ్లు దొరుకుతాయా ఇక్కడెక్కి" అనడిగాడు.

"దొరుకుతై. అటెల్లండి."

కొంతదూరం వెళ్ళి గొర్రెల్ని దాటుకుని పోయి, వో చిన్న చెరువు చూశాడు. ఎండలో తళతళ మెరుస్తూ నిర్మలంగావున్న నీటిని చూస్తే జోగారావుకు నోరూరింది! త్వరత్వరగా కడుపునిండా నీళ్లు తాగి, మొహం కడుక్కొని నీడలోకివచ్చి కూచున్నాడు. దూరంగా ఎక్కడో వో కుర్రాడి ఏడుపు వినిపించింది. లేవబోయి, మళ్ళీ కూచున్నాడు. "వెంకటరమణా కాదూ నా కార్థమూ కాదూ" అని గొణుక్కున్నాడు. వీడు ఎక్కడ వున్నాడో? ఎండ వొకటి! 'ఇంటికి పోతేనో' అనిపించింది. పోతే 'నూర్రూపాయలు' పోతాయి. అసుర్ను-మరి ఐతే అవుతుంది - తను సాధించదల్చుకున్న మహత్కార్యం మొదలే సఫలీకృతం ఐపోతుందా! కాదు కాదు. ఎన్ని అవాంతరాలో వస్తాయి. అన్నిటినీ ఎదుర్కొంటూ తను ముందుకు సాగిపోవాలి! ఏ కష్టమూ పడకుండా 'నూరూ' అప్పణంగా చేతిలో కొస్తాయా యేమిటి?-

జోగారావుకు వుత్సాహం కలిగింది. సిగరెట్టుతీసి ముట్టించి, ఘాటుగా లాగి పొగ వదిలాడు. పోయిన శక్తంతా వొక్కసారి తిరిగొచ్చినట్టయింది - లేచాడు - వెంకటరమణ కోసం బయల్దేరాడు!

ఇటు పక్క తోటలూ, రోడ్లూ, పాడుపడ్డ దేవాలయాలూ అన్నీ వెతకటం ఐపోయింది. ఈసారి రైలుకట్టవేపు బండి నడిపించాడు. మామూలు రోడ్డమ్మటపోతే ఇటూ అటూ చెట్లుండి చల్లగా వుంటుంది గాని, ఈ రైలుపట్టాల పక్కన నీడను వూహించటానికే లేదు! నడుస్తున్నాడు...ఇటూ అటూ చూస్తున్నాడు - వెనక్కి తిరిగి చూస్తున్నాడు - ఎవడూ కనిపించటం లేదు. దూరంగా రైల్వేస్టేషను మాత్రం కనిపిస్తున్నది.

ఇంకా నడుస్తున్నాడు......

అటునుంచి ఎవడో వస్తున్నాడు - ముసలాయన. ఆయన వస్తూ వస్తూ "వెంకటరమణా" అని అరిచాడు! జోగారావుకు గుండె ఆగిపోయినంత పనయింది. తనమీద ఎవడో 'కాంపిటీషన్' తగిలాడు! ఈయనకూడా వెంకటరమణను వెతుకుతున్నాడు. ఇంతవరకూ తను పడిన శ్రమంతా వృథా అన్నమాట! అవునుమరి - నూరు రూపాయలకోసం ఎంత మందన్నా ప్రయత్నిస్తారు. తనొక్కడి స్వంతమా యేమిటి? ముసలాయన రాకనుబట్టి చూస్తే ఈ కుర్రాడు అటుపక్క ఉండివుండడు— అంచాత తను వెనక్కి తిరిగి పోవటమే మంచిదేమో ననిపించింది. ముసలాయన మళ్ళీ "వెంకటరమణా" అని అరిచాడు. మళ్లీ జోగారావుకు గుండె ఆగిపోయినంత పనయ్యింది. ఆయన తన్ను సమీపించాడు - జోగారావుకు 'ఠకీ'మని ఆలోచన తట్టింది - తనూ వెంకటరమణకోసమే బయల్దేరినట్టు తెలియరాదు!

"ఏమండీ - ఈ ఎండలో బయల్దేరారేం పాపం!" అన్నాడు జోగారావు ఆ ఉన్ని ఎరిగినట్టు. ముసలాయన యెగాదిగా చూసి "రాత" అన్నాడు.

ఆ 'రాత' తనకు తెలియదనుకున్నాడు కాబోలు! "వెంకటరమణ అనే కుర్రాడెవడో తప్పిపోయినట్టు నిన్న పేపర్లో చదివాను. మీకేమన్నా బంధువా?" అన్నాడు జోగారావు. ముసలాయన "ఉండవయ్యా కాళ్లు మాడిపోతున్నై" అన్నాడు చిరాగ్గా.

"చెప్పండి - మీకు బంధువా?"

"ఏడికాడు. ఎవడయ్యా వాడూ?"

"మీరు పిలుస్తూపోతున్నారు - ఆ వెంకటరమణ."

"నీ మొహం - నేనెవడినీ పిలవ లేదు. నానెత్తి మాడిపోతూ నడవలేక, వెంకటరమణ మూర్తిని తలుచుకుంటూవుంటే - 'పిలుస్తున్నారా' అంటావేమిటి మతిలేక?"

జోగారావుగుండె చరదరమని పనిచెయ్యటం మొదలుపెట్టింది! అమ్మయ్య - రక్షించాడు!

"అబ్బబ్బ ... ఏం ఎండ ఏం ఎండ ... రామచంద్రా - తిరుపతి వెంకటరమణా..." అంటూ సాగిపోయాడు ముసలాయన. జోగారావుకు ఎందుకో నవ్వొచ్చింది!

రైల్వేస్టేషను సమీపిస్తున్నది. జోగారావు జాగ్రత్తగా చూస్తున్నాడు. కుర్రాళ్లు- ముఖ్యంగా ఏడెనిమిదేళ్ల ప్రాయంవాళ్లు కావాలి! స్టేషన్ చాలా నిశ్శబ్దంగా వుంది- ప్లాటుఫారంమీద నీడలో పోర్టర్లు నిద్రపోతున్నారు. దగ్గరలో రావలసిన బండీ ఏదీ లేదు కాబోలు ప్రయాణీకులన్నా ఎవరూ లేరు!

స్టేషనంతా గాలించాడు. ఓమూల ముస్తెత్తుకుంటూ కుర్రాడొకడు కనిపించాడు. జోగారావు పరిశీలిద్దామని దగ్గిరికి పోబోతే, ఆ కుర్రాడు పరుగెత్తవస్తూ

# ★ తప్పిపోయినాడు ★

'బాబూ' అని చెయ్యి చాచాడు - అంతే! జోగారావు వెనక్కి తిరిగిపోయాడు. స్టేషన్‌మాష్టరు గదిలోకి చూశాడు. ఆయనకు విరామం దొరికిందని, నిద్రలో వున్నట్టున్నాడు. మరోగదిలో ఇంకెవరో నిద్రపోతున్నారు. అంతా నిద్రపోతూవుంటే తనేమిటో ఈ ఎండలో ఇట్లా తిరగటం? - కాస్సేపు ఈ 'వైటింగ్ రూమ్'లో విశ్రాంతి తీసుకునిపోతేనో? 'బాగానే వుంది' అనుకుని, రూమ్‌లోకొచ్చేసరికి ఆలోచన తట్టింది. తను నిద్రపోయిలేచేలోగా వెంకటరమణ ఎవడికన్నా దొరికిపోతే? - 'ఊహూఁ' అని వెనక్కి తిరిగి, కాసిన్ని మంచినీళ్లు తాగి, వెంకటరమణ దొరికేవరకూ నిద్రపోకూడదు అనుకుని, మళ్ళీ అన్వేషణలో పడ్డాడు!

జోగారావు వూళ్లోకొచ్చేసరికి సూర్యాస్తమయం ఐపోయింది. ఆకలి వేస్తున్నది. జేబులో చెయ్యి పెట్టిచూశాడు - మూడణాలు తగిలినై. హోటల్లో కాఫీ తాగాడు. సిగరెట్టుపెట్టెలో ఆఖరిసిగరెట్టు ముట్టించాడు. కాళ్లు స్వాధీనంలో లేవు! 'వెంకటరమణా' అనుకున్నాడు తనలో. ఆ కుర్రాడినే పిలిచాడో, భగవంతుడినే స్మరించాడోగాని రెంటికీ తగ్గట్టుగావుంది!

ఇంటికి చేరుకుని అరుగుమీద కూలబడ్డాడు. మధ్యాన్నంనుంచీ తను ఎండలో మాడి, వూరవతిలంతా చూశాడు. ఎక్కడా వాడులేడు. అంచాత వూళ్లోనే వుండి వుండాలి - రాత్రి మరొక్కసారి సినిమా థియేటర్లపక్కనూ, బస్సుస్టాండులోనూ చూసేస్తే సరిపోతుంది!

ఎనిమిదిగంటలప్రాంతాన భోజనం చేసేసి మళ్ళీ బయల్దేరాడు జోగారావు.. సినిమా థియేటర్లూ బస్సుస్టాండూ, పేవ్‌మెంట్లూ అన్నీ వెతికాడు - అన్నీ చూశాడు. కొందరు కుర్రాళ్లు కనిపించారు. వాళ్లెవరూ 'వెంకటరమణలు' కారు! తిరిగి తిరిగి ఇల్లు చేరుకుని, తలుపు తడుతూవుంటే పక్కింటి గోడగడియారం పన్నెండు గంటలు కొట్టింది!

ఆరాత్రి జోగారావుకో చిత్రమయిన కల! తను వెంకటరమణను పట్టుకున్నాడు - తను పడిన శ్రమకు ప్రతిఫలంగా నాగభూషణం గారు నూరుకు మరి నూరు చేర్చి, నోట్ల కట్టలు చేతిలోపెట్టి నమస్కరించారు! పెద్దగా సత్కారం చేశారు. ఏ మంత్రిగారికీ, కళాకారుడికీ జరగనటువంటి ఘన సన్మానం జరిగింది జోగారావుకు!

ఎనిమిదిగంటలయితేనేకాని లేవని జోగారావు ఆ మర్నాడు ఆరింటికే లేచాడు. పనులన్నీ ముగించుకుని, వుత్సాహంగా వూరిమీద పడ్డాడు. రాత్రి కల ఈరోజు నిజమయి తీర్తుంది! రెండు వందలూ, ఆ సన్మానం మాటకేంగాని - ఆ నూరు రూపాయలూ ఇస్తే చాలు - అంతకంటె ఇంకేం కావాలి! ఈసారి తప్పకుండా కుర్రాడు దొరుకుతాడని అతని అంతరాత్మ అంటున్నది! మళ్లీ వూరంతా తిరిగాడు - అన్ని చోట్లూ చూశాడు. ఏనాడూ చూడని ప్రదేశాలు ఈ మూలంగానన్నా తిరిగాడు!

తొమ్మిది గంటలకు హోటల్లో టిఫిన్ తిని బయటకొచ్చి సిగరెట్టు ముట్టించి - మళ్ళీ తిరిగాడు. చాలామంది కుర్రాళ్ళను అడుగుతున్నాడు. ఒకచోట 'వెంకటరమణ' అనే కుర్రాడు కనిపించాడు - ఐతే వాడి తండ్రిపేరు నాగభూషణం కాదట! మరోచోట నాగభూషణంగారి అబ్బాయే కనిపించాడు. ఐతే వాడిపేరు సూర్యప్రకాశరావు!

మళ్ళీ ఎండ ప్రారంభం. - నెత్తి మాడుతున్నది. వెంకటరమణ దొరకాలి - నూరు రూపాయలూ చేతిలో పోసుకునిగాని ఇంటిమొహం చూడరాదు అనే పట్టుదల ఓవేపు వుండనే వున్నది!......

షుమారు పన్నెండుగంటల ప్రాంతాన జోగారావుకు ఆ వీధిలో వెంకటరమణ కనిపించాడు! అవును - నిజమే - వెంకటరమణ కనిపించాడు!! అన్ని పోలికలూ వున్నై. ఆ కుర్రాడు వీధిలో నించుని - ఎలక్ట్రిక్ తీగల మధ్య చిక్కుపడివున్న గాలిపటాన్ని చూస్తున్నాడు!

"నీ....నీ...నీ - పేరు వెంకటరమణేనా?"

కుర్రాడు అవునన్నాడు.

"మీ నాన్నగారి పేరు?"

సరిగ్గా చెప్పాడు! జోగారావుకు స్వర్గంలో విహరిస్తున్నట్టనిపించింది. నోటమ్మట కాస్సేపు మాట పెగల్లేదు! "మీ యింటికి పోదామా?" అన్నాడు.

"ఎందుకూ?"

"తప్పమ్మ - పద" కుర్రాణ్ని తీసుకుని నడిపించాడు.

"ఇదే మాయిల్లు" అన్నాడువెంకటరమణ.

ఆరి పీడిల్లు బంగారం గానూ - ఇంటిదగ్గరికే వచ్చి నించున్నాడన్నమాట! కాస్సేపు తను ఆలస్యంచేస్తే ఇంట్లోకిపోయివుండును-తన అదృష్టం!

"మీ నాన్నగార్ని రమ్మను"

కుర్రాడు లోపలికిపోయి నాగభూషణంగార్ని వెంటబెట్టుకొచ్చాడు.

"నమస్కారం. ఇదిగో మీ అబ్బాయి. మీ ప్రకటన చూశాను - చాలా శ్రమపడి, వెతికి తీసుకొచ్చాను"

"మనిషిలా మాట్లాడే గాడిదని నేను చూశానండి."
"మీ బొంద. గాడిద ఎలా మాట్లాడుతుంది?"
"దానికే ముందండి. మనుషులు గాడిదల్లా మాట్లాడగలుగుతున్నపుడు, గాడిదలు మాట్లాడ్డంలో వింతేముంది?"

నాగభూషణం గారి మొహంలో కుర్రాడు దొరికాడన్న సంతోషం ఏమాత్రం కనిపించలేదు.

"క్షమించండి. కుర్రాడు ఎక్కడికీ పారిపోలేదు. పక్కయింట్లోనే వున్నాట్ట-మేము టెలిగ్రామ్ ద్వారా ప్రకటన పంపాము. ఆ తర్వాత కుర్రాడే వచ్చేశాడు!...కుర్రాడు వున్నాడని, ప్రకటన వెయ్యొద్దని పత్రికలవాళ్ళకు వైర్ చేశాము. అప్పటికే అది ముద్రణ అయిపోయిందట! అప్పట్నుంచీ ఇంట్లోనే ఉన్నాడు — ఇప్పుడే వీధిలోకెళ్ళాడు. ప్రకటనను వుపసంహరించుకున్నట్టు ఈరోజు పత్రికలో వుందే—చూడలేదూ?" అన్నాడు నాగభూషణం.

జోగారావు కాళ్ళూ చేతులూ అన్నీ గాల్లో తేలిపోయినై. మాట కట్టేసింది! కొన్ని క్షణాలపాటు గుండె కొట్టుకోటం మానేసింది!

జోగారావు కళ్ళుతెరిచి చూసేసరికి నాగభూషణంగారు అక్కడలేరు. వెంకటరమణమాత్రం మూడుచక్రాల సైకిలు తొక్కుతూ వాకిట్లో కనిపించాడు!! ★

డిటెక్టివ్ సీరియల్

# అపూర్వ హంతకులు

మూలం: ఎడ్గార్ వాలెస్ అనువాదం: 'వినాయక'

## 3

## వెయ్యి పౌనుల బహుమతి!

పార్లమెంటు భవనంలో 'బాంబు యంత్రం దురంతాన్ని' గురించి పత్రికలనేకం సంపాదకీయాలు రాశాయి. చాలా పత్రికలీ సంఘటనతో ఇంగ్లండంతా అట్టుడికిపోయిన ట్టుడికిపోయిందని వ్యాఖ్యానించాయి! అంటే అతిశయోక్తి ఏమీ లేకుండా ఉన్నది ఉన్నట్టుగానే చెప్పాయన్నమాట!

తాజావార్తలందించడంలో బాగా వెనకపడిపోయిన పత్రికలు కొన్ని మొట్టమొదట 'అపూర్వ హంతకులకు' సంబంధించిన వార్తలన్నీ వెటకారంగా వెనక్కి నెట్టేశాయి!

ఒక్క 'బాకా' దినపత్రిక మాత్రమే 'మంత్రిమీద విరుచుకుపడే మహాప్రమాదమ్' పనిగట్టింది. పత్రికారచన సంప్రదాయ సంరక్షణలో ఆంగ్లదేశానిదే అగ్రతాంబూలం. అయినా ఈ 'అపూర్వహంతకుల' సమాచారం కొంతవరకు, పత్రికా ప్రపంచంలో హఠాత్తుగా అవతరించింది! ఇందుచేత ఈవిషయం మొట్టమొదట అంతగా పట్టించుకోకుండా నిర్లక్ష్యంచేసిన పత్రికలుకూడా ఇప్పుడు ఇంక ఏదో కొంత గందరగోళం చెయ్యకతప్పలేదు! వెంటనే ఆంగ్ల దేశపత్రికలన్నీ 'అపూర్వ హంతకుల' వార్తలతో మోతెత్తిపోయాయి! ఎక్కడ చూసినా ఈహంతకులిటీవల పార్లమెంటు భవనంలో జరిపిన బాంబుదురంతం వార్తలే!

హంతకుల గురించిన అభూత కల్పనలెన్నెన్నో పత్రికల్లో కెక్కాయి! ఆంగ్లదేశంలో ఒక ప్రముఖ మంత్రి ప్రాణాలు తమగుప్పిళ్లలో పెట్టుకున్న ఈ నలుగురిమాట వినిపించనిచోటే లేదు!

పార్లమెంటు భవనంలో 'బాంబు' కనిపించిన తరవాత బయలుదేరినంత ప్రచండ కల్లోలం—ఐర్లండ్ విప్లవ దారుణాల తరవాత - ఇటీవల ఎన్నడూ తలెత్తనేలేదని ఒకానొక పత్రికారాజం ఎంతో హుషారుగా సంపాదకీయం రాసింది!

ఈ నలుగురు కలిసి ఒక ప్రముఖ మంత్రిని చంపివేస్తామని బెదిరించడంవల్లనే ఈవార్త బాగా అందరి దృష్టి ఆకర్షించింది.

హంతకుల లక్ష్యం మొట్టమొదటగా జనంలో బాగా అలజడి రేకెత్తించినమాట నిజమే. కాని మొదట ఈ ప్రమాదం అంతగా మీదవిరుచుకుపడడం లేదనే అంతా అనుకున్నారు. కాని ఆ ప్రమాదం అంతా ఇప్పుడొక పెనుప్రళయంలాగ లండన్ నగరం మధ్యలోకే వచ్చి పడడం చేత అందరూ తమ పక్క కూర్చున్న వాళ్లని కూడా అనుమానించడం మొదలుపెట్టారు. ఆ నలుగురు హంతకుల్లోను ఎవరో ఒకరు తమ పక్కనే పొంచివున్నారేమోనని అనుమానం పీడించని మనిషే లండన్‌లో కనిపించలేదు! నగరం నగరం అంతా ఈ భయసంభ్రమాలతో గజగజలాడిపోయింది! ప్రతీ పోలీసు స్టేషనుమీద, ప్రతీ గోడమీద పెద్ద పెద్ద నల్ల నల్లని అక్షరాలతో ఈ విస్తారంగా ప్రకటనలు ప్రత్యక్షమయ్యాయి!

"వెయిపౌనుల బహుమతి"

"ఇందుమూలంగా అందరికీ తెలియజేయునది ఏమనగా ఆగస్టు 18 వ తేదీని సాయంత్రం సుమారు నాలుగున్నరగంటలకు పార్లమెంటు సభ్యుల గదిలో బాంబులాంటి భయంకర యంత్రం ఒకటి ప్రత్యక్షమైంది అది అక్కడ ఎవరు పెట్టారో తెలియడం లేదు. ఆ బాంబు అక్కడ పెట్టిన వాళ్లు 'అపూర్వ హంతకుల' ముఠాకు చెందినవాళ్లై ఉండవచ్చునని ఊహించడానికి వీలుగా కొన్ని తార్కాణాలు కనిపిస్తున్నాయి! లండన్ పారిస్, న్యూయార్కు మొదలైన మహానగరాల్లో వీరిమీద హత్యలనేరాలారోపిస్తూ ఇంతకు పూర్వమే ఎన్నెన్నో వారంటులు జారీచేశారు. 'అపూర్వ హంతకులు'ని

---

**జరిగిన కథ:-**

స్పెయిన్ దేశంలో ప్రభుత్వానికి వ్యతిరేకంగా తిరుగుబాటు జరుగుతున్న రోజుల్లో విప్లవకారులు ఇంగ్లాండులో మకాం వేశారు. వాళ్ళని వెళ్ళగొట్టడంకోసం ఆంగ్లదేశమంత్రి పార్లమెంటులో ఒక చట్టం ప్రవేశపెట్టాలని అనుకున్నాడు. ఆ మంత్రిని హత్యచేస్తే ఆ చట్టం అడ్డగించవచ్చును.

న్యాయపరిరక్షణభారం వహించిన నలుగురు 'అపూర్వ హంతకులు' ఆ చట్టం ప్రవేశపెడితే మంత్రిని చంపివేస్తామని బెదిరిస్తూ ఉత్తరం రాశారు. 'బాకా'పత్రిక ఆ ఉత్తరం నకలు ప్రకటించడంతో ఊరూ వాడా గుప్పుమంది.

పార్లమెంటులో ఈ చట్టం ప్రవేశపెట్టే ముందు కొంచెం చర్చ జరిగింది. ఇంతలో ఒక సభ్యునికి ఒక ఉత్తరం అందింది. అది 'అపూర్వ హంతకులు' పార్లమెంటు సభ్యులను చట్టం ఆమోదింప జేయవద్దని హెచ్చరిస్తూ రాసిన బెదిరింపు ఉత్తరం! దీనితో పార్లమెంటుసభ్యులలో పెద్దఅల్లకల్లోలం బయలుదేరింది!

BY. 1702

మీ క్రొత్త చొక్కాలకు ప్రఖ్యాతి గాంచిన

# కాట్స్‌వాల్

కొనండి
ఇది మెత్తగా, సౌఖ్యముగా ఉంది.
దేహమునకు గాలి ఆడేలా
ఉంచుతుంది



బిన్నీ కాట్స్‌వాల్ అన్ని శీతోష్ణ స్థితులలోను వాడుటకు అనువుగా ఉంటుంది

ఏక రంగు రకములు 29/30"
ఒక గజమునకు రు. 3/10
ఇజారు చారలు 29/30"
ఒక గజమునకు రు. 3/10
ఏక రంగు రకములు 35/36"
ఒక గజమునకు రు. 4/5
అద్దకములు 29/30"
ఒక గజమునకు రు. 4/4
చెక్కు గుడ్డలు 29/30"
ఒక గజమునకు రు. 4/1
అమ్మకపు పన్ను అదనము

ఈసారి మీరు క్రొత్త చొక్కాలు కుట్టించు కొనునపుడు ఆకర్షణీయమైన కాట్స్‌వాల్ ఎన్నుకొనండి. కాట్స్‌వాల్ తేలికగా వుండే బట్ట. ఇది ఉలు మరియు నూలుల సరియైన మిశ్రమములో తయారైనది.

కాట్స్‌వాల్ దేహమునకు గాలి ఆడేలా ఉంచుతుంది. కనుక మీకు చిరాకు కలిగించేటంత వేడిగా ఎన్నడూ ఉండదు. ఈ ఆకర్షణీయమైన కాట్స్‌వాల్ చాల కాలము మన్నుతుంది, మరియు క్రుంగకుండా ఉంటుందని హామీ కలదు. ఇది క్రుంగుతే దీనికి బదులుగా బట్ట యివ్వబడుతుంది.

కాట్స్‌వాల్ అనేక దివ్యమైన అద్దకములు మరియు రంగులలో దొరకుతుంది — మీ బట్టల వర్తకుని వద్దకు వెళ్లి నేడే చూడండి!

ఇంకా వెచ్చని దుస్తులకు బిన్నీ అంగోలా కొనండి

ఈ నాణ్యమైన ఉలు, నూలు కలిపి దట్టముగా నేసిన బట్ట చల్లని శీతోష్ణస్థితిగల ప్రదేశములు, పర్వత ఆశ్రయములకు తగినది చొక్కాలకు స్త్రీల దుస్తులకు, మరియు ఇజార్లకు అందమైన రకములలో ఏక రంగులో దొరకుతుంది.



బెంగుళూర్ వులెన్, కాటన్ & సిల్క్ మిల్స్ కంపెనీ లిమిటెడ్

ఏజెంట్స్, సెక్రటరీస్ & ట్రెజరర్స్: బిన్నీ అండ్ కంపెనీ (మద్రాసు) లిమిటెడ్

# ★ అపూర్వ హంతకులు ★

"మీరు సిగరెట్లు కాలుస్తారా?"
"కాల్చను."
"మద్యం పుచ్చుకుంటారా?"
"ఊహూ."
"జూదం ఆడుతారా?"
"అబ్బెబ్బే."
"మరేం చేస్తారు?"
"అబద్ధాలాడతాను,"

యిత!" అని పొద్దస్తమానము గొడ్డు చాకిరీ చేసి మొహం వేలవేసిన ఒక సామాన్య సహాయ సంపాదకుణ్ణి ప్రశ్నించారు!

"ఈయన పోలీసుల కోర్టులు, శిక్షపంచాయితీలు, గోలీలు మొదలైనవాటి గోలంతా రాసి పంపిస్తూంటేవాడు! ఇటీవలే సాహిత్యంలో స్వంత వ్యవసాయం మొదలెట్టాడు! అని" సమాధానం!

ఒక్క 'బాకా' పత్రికే అన్న మాటేమిటి! ప్రతీ పత్రిక కార్యాలయంలోను ఇదే తతంగం! ఉపసంపాదకులకు, సహాయ సంపాదకులకు వచ్చే ప్రతి చిన్న కాగితం మీద ఈ ఘోషే! ఈ క్షణంలోనో మరుక్షణంలోనో ఏదో మహా ప్రళయం ముంచుకొచ్చేస్తూందని భయపడని పత్రికా రచయితే లేడు! పోలీసు కోర్టులలో వచ్చే సాక్ష్యాల్లోకూడా ఈ హంతక చతుష్టయాన్ని గురించిన ఆందోళనలే!

కొంతమంది ఈ ఆందోళన ఉద్ధృతానికి తట్టుకోలేక తప్పతాగి కొన్ని అల్లరి చిల్లర పనులు కూడా చేశారు! ఒక కుర్రాడీ గోలలో పోలీసుల చేతుల్లో పడ్డాడు. ఆ కుర్రవాడి తల్లి బుశిబుశి దీర్ఘాలు తీస్తూ "మా అబ్బాయి ఎప్పుడూ ఇలాంటిపనులు చెయ్యలేదు బాబూ! పేపర్లలో ఈ మాయదారి హంతకుల దారుణాలన్నీ చదివి తల తిరిగి కొంచెం హెచ్చుమోతాదులో పడ్డాడండి అంతే!" అని తన కొడుకును సమర్థిస్తూ క్షమించవలసిందని ప్రార్థించింది. పాపం మాజిస్ట్రేటు కొంచెం మంచివాడో ఏమో! అట్టే హెచ్చుగా వడ్డించకుండా తగ్గుమోతాదులోనే శిక్ష విధించాడు.

అసలీ కథకంతకీ ప్రధాన నాయక పాత్ర వహించిన సర్ ఫిలిప్ రేమన్ మాత్రం ఈ విషయంలో ఏమీ తొణక్కుండా నిబ్బరంగా ఉన్నాడు!

ఎలాంటి వార్త వచ్చినా సరే, తర్కించవలసిన అవసరం లేదని ఖచ్చితంగా ఫర్మానా జారీచేశాడు. తనకు రాబోయే హత్యాప్రమాదాన్ని గురించి చివరికి ప్రధాన మంత్రితో కూడా చర్చించడానికి అంగీకరించలేదు! ధైర్య సాహసాలభినందిస్తూ వేలాదిగా వచ్చిపడే జాబుల కన్నిటికీ ఒక ఉదయం పత్రికలో ఒకే ఒక్క ప్రకటన చేశాడు! దయచేసి ఎవ్వరు ఎలాంటి ఉత్తరాలు వ్రాయవద్దనీ ఒకవేళ రాస్తే అవి చెత్తచెదారంలోకే జమ అయిపోతాయనీ ఆ ప్రకటన సారాంశం! సర్ ఫిలిప్ రేమన్ ప్రపంచం తల్లకిందులైనా సరే పార్లమెంటులో తాని చట్టం ఆమోదింప చేయించి తీరతానని కూడా ప్రకటించాలనే అనుకున్నాడు. కాని ఇదంతా పట్టి బుకాయింపులా కనపడిపోతుందేమోనని చివరికా విధంగా ప్రకటించడం మానేశాడు.

ఇక ఈ మంత్రి ప్రాణ సంరక్షణ భారం అంతా డిటెక్టివ్ సూపరింటెండెంటు ఫాల్మాత్ భుజస్కంధాల మీదనే ఒరిగింది. ఇందుచేత ఈ ఉద్యోగియెడల మంత్రి ఎంతో ఆప్యాయత కనబరిచేవాడు! ఇతగాడావలిస్తే పేగులు లెక్కపెట్టేరకం. ప్రాణభయంతో గిలగిలలాడే మనిషిపరిస్థితి బాగా దగ్గరగా పరిశీలించే అవకాశం ఈ ఉద్యోగికొక్కడికే దొరికింది!

"ఇదిగో! ఇంతకీ ఇందులో అంత ప్రాణాపాయం ఉందంటావా?" అని మంత్రి అదేపనిగా అనేకసార్లు అడిగాడు. సూపరింటెంటు పోలీసుబలగం బలపరాక్రమాలాకాశాని కెత్తేస్తూ 'ఎంతమాత్రం భయంలేదని గట్టిగా భరవసా ఇచ్చేవాడు!

ఇతడు ఇంత ధైర్యంగా మాట్లాడడానికొక చిన్న కిటుకుంది.

"అసలే ప్రాణభయంతో బిక్క చచ్చిపోయిన మనిషి నింకా హడలగొడితే ఏం లాభం? ఒకవేళ ఏమీ జరక్కపోతే "పోలీసుద్యోగి చాలా గట్టివాడే!" అని మంత్రి తన్నెంతో మెచ్చుకుంటాడు! అలాకాక మర్డరూ అయిపోతే మంత్రి మళ్ళీ తిరిగి వచ్చి, ఇదేమిటని సంజాయిషీ అడగడు గదా!" అని ఆ ఉద్యోగిలోలోపల సమాధానపడ్డాడు!

డిటెక్టివ్‌కి మంత్రిధోరణి చాలా చిత్రంగా కనిపించింది. మంత్రి ఈ సంగతి ఇట్టే కనిపెట్టేశాడు! ఒకసారి డిటెక్టివ్ మంత్రిగారి ధోరణి కొంత జాగ్రత్తగా పరికించి చూస్తున్నాడు. మంత్రి వెంటనే మేకపోతు గాంభీర్యం నటిస్తూ అతన్నిలా దబాయించాడు:

"ప్రాణాపాయం ఉందని తెలిసినా నేనీ చట్టం ఎందుకు విడిచిపెట్టడం లేదు?" అని నీ కాశ్చర్యంగా ఉందేమో! చెబుతున్నాను విను మరి! నమ్ము! నమ్మకపో! నాకు మృత్యుభయం అంటే ఏమిటో తెలియనే తెలియదు! నా ఊహకి కూడా అది అందడం లేదు.

చిన్నప్పటినించీ తలనొప్పి అంటే ఏమిటో కూడా నాకు తెలియదు. ఇక చావంటే ఏమిటో దానిమూలంగా వచ్చే సంతోష మేమిటో నాకేం తెలుస్తుంది! ముందేదో ఉందని అనుకోడం మూలానే చావంటే ఇంతభీభత్సం బయలుదేరుతూందని నా నమ్మకం! ఇంతా చేస్తే చచ్చిపోయిన తరవాత మన పరిస్థితులింతకన్నా ఘోరంగా ఉంటాయనడానికేమీ కారణం కనిపించదు! నాకు చావంటే ఏమీ భయం లేదు గాని, చచ్చిపోవడం అంటేమాత్రం మహా చెడ్డ భయం!"

పోలీసుకీ వేదాంతంఘోషేమీ బుర్రకెక్కలేదు! అసలీ శషభిషలగొడవే అతనికి తెలియదు! అయినా కొంచెం ఆప్యాయత కనబరుస్తూ "ఔనౌను! సార్! అంతే! అంతే సార్!" అని మెల్లిగా నసిగాడు.

స్వీయ భవంతిలో సుఖాసీనుడై ఉన్న మంత్రి మళ్ళీ అందుకున్నాడు:

"సరిగా చచ్చిపోయే సమయంలో ఏమి జరుగుతుందో నాకు తెలియదు గాని, విదేశాలతో జట్టీలు తెచ్చిపెట్టుకుంటే మాత్రం

# ★ అపూర్వ హంతకులు ★

అదెలాంటి వచ్చే చావో నాకు బాగా తెలుసును! ఇంతకీ చావంటే అంత పెద్ద ఇబ్బంది ఏమీ ఉండదనుకుంటాను. దీనికోసమని బ్రతికుండగానే ఈ పెద్ద బెడదలన్నీ మీద పడవేసుకోవడం నా కిష్టం లేదు.

ప్రతిపక్షానికీ మంత్రి ధోరణి అంతా బాగా నచ్చితే! కనకనే మంత్రివన్నీ డొంకతిరుగుడు ఆలోచనలేనని ప్రతిపక్షం అడుగడుక్కూ దుమ్మెత్తి పోస్తూంటుంది.

డిటెక్టివ్ పైకిదంతా చాలా జాగ్రత్తగా వింటూన్నట్టే నటించాడుగాని, లోలోపల ఒక్కసారి హాయిగా అవలించుకుని, "మంత్రిగారెన్నెన్ని పెద్ద పెద్ద గ్రంథాలు చదివార్రా!" అని ఎంతో ఆశ్చర్యపడ్డాడు. సర్ ఫిలిప్ రేమన్ చేసిన ఉపన్యాసం అంతా సాంతంగా విన్న తరవాత, మళ్లీ మెల్లిగా ఇల్లా సలహా చెప్పాడు!

"దీనిలో తీసుకోవలసిన జాగ్రత్తలన్నీ తీసుకున్నాం సార్! అయితే ఒక్క చిన్న మనవి. రెండు మూడు వారాలదాకా కొత్త మా జవానులు మీ వెంట వెంట తిరుగుతూంటారు! దీనికి మీరేమీ చిరాకు పడకూడదు! మీరీ భవంతిలో ఉన్నప్పుడు మాత్రం ఇద్దరో ముగ్గురో ఈ ఇంట్లో ఉంటారు. దీనికి తను ఫర్మానా జారీ చేయించాలి! మీరు ఆఫీసులో ఉన్నప్పుడింక వేరుగా చెప్పనే అక్కర్లేదుగదా!"

మంత్రి వెంటనే దీని కంగీకరించాడు. తరువాత వారిద్దరు తలుపులు మూసిన గుర్రపు బగ్గీలో పార్లమెంటు భవనానికి బయలుదేరారు! లోపల సుఖంగా కూర్చున్న మంత్రి బగ్గీకి రెండువైపులా మోటారుసైకిళ్లున్నాయనీ వాటిమీద పోలీసులున్నారనీ గ్రహించాడు. ఇంకా ఒకటి రెండు బగ్గీలుకూడా మంత్రి బగ్గీ వెనకాలే వెళ్లాయి. మంత్రికో బందోబస్తు ఆంతర్యం అంతా బాగా అర్థమయిపోయింది.

అది పార్లమెంటులో కార్యక్రమం ప్రకటించే సమయం. కుర్చీలు చాలావరకు కాళీ అయిపోయాయి. విదేశ శాఖ మంత్రి సర్ ఫిలిప్ రేమన్ మెల్లిగా లేచి నిలబడి, వచ్చే మంగళవారంనాడు—అంటే సరిగ్గా పది రోజుల్లో—విదేశీయ బహిష్కార శాసనం రెండోసారిచర్చ ప్రారంభం కాగలదని ప్రకటించాడు.

* * *

సరిగా ఆవేళ సాయంత్రమే ఒక పార్కులో మాన్‌ఫ్రెడ్, గొన్సాలెజ్ లిద్దరు కలుసుకున్నారు. ఆ పక్కనే ఒక భవనం విద్యుద్దీపాలకాంతిలో తళతళ మెరిసిపోతూంది. మాన్‌ఫ్రెడ్, గొన్సాలెజ్ కా అద్భుతదృశ్యం చూపించాడు! కొంచెం దగ్గిరగా బాండువాయిద్యం వినబడుతూంది. చుట్టుపక్కల ఉన్న జనం అంతా ఆ సంగీతస్వారస్యాన్ని గురించి చర్చించుకుంటున్నారు.

మాన్‌ఫ్రెడ్ గొన్సాలెజ్ కేసి తిరిగి "అయితే థెరీ మాటేమిటి?" అన్నాడు.

"పాయ్‌కార్ట్ అతన్ని వెంటబెట్టుకుపోయి లండన్ పట్టణం వింతలన్నీ చూపిస్తున్నాడు" దీనికి ఇద్దరూ నవ్వుకున్నారు.

"సరి నీమాట!" అన్నాడు గొన్సాలెజ్.

"నేనీరోజంతా చాలా కులాసాగా గడిపేశాను. గ్రీన్‌పార్కులో నాకొక చిత్రమైన డిటెక్టివ్ కనిపించాడు. పాపం ఒట్టి అమాయికుడు! హంతకులనుగురించి నీ అభిప్రాయం ఏమిటని అడిగాడు!"

ఇంతలో ఇద్దరు మళ్లీ సంగీతాస్వాదనలో పడ్డారు. తిరిగి గొన్సాలెజ్ "అంతా తయారుగా ఉన్నారా?" అన్నాడు. మాన్‌ఫ్రెడ్ సంగీతంలోపడి ఆదమరుపుగా ఈల వేశాడు! తరవాత పక్కనున్న వారందరితోనూ కలిసి ఆ సంగీతం మెచ్చుకుంటూ చప్పట్లు కొట్టాడు! తరవాత "నే నీమధ్యన మంచి భవనం ఒకటి సంపాదించాను. మనంఅంతా అక్కడికి చేరుకోవడం మంచిది!" అన్నాడు.

"అక్కడ అన్నీ అమరుగా ఉన్నాయా!"

మాన్‌ఫ్రెడ్ సన్నగా కన్నుగీటి "ఓ! అన్నీ ఉన్నాయి!" అన్నాడు.

ఇంతలో బాండువాళ్లు జాతీయగీతం మొదలెట్టారు.

ఇద్దరు టోపీలు చేతులలో పట్టుకుని, లేచి నిలబడ్డారు. క్రమక్రమంగా బాండు దగ్గిర గుమిగూడిన జనం అంతా సాయంకాలం చీకటిలో కలిసిపోయారు. ఇక మిగిలిన ఇద్దరూ తిరుగుముఖంపట్టారు.

ఒక్కసారిగా వేలకొలది దీపాలు వెలిగాయి. ఆ ప్రాంతం అంతటా గాస్‌వాసన గుప్పుమంది. "ఈ సారి వెనక చేసినట్లు చెయ్యకూడదు!" అన్నాడు గొన్సాలెజ్ తన పెద్దరికం కనబరుస్తూ.

"నిజమే! ఏమైనా సరే! ఈసారి మాత్రం వెనకచేసినట్టు చెయ్యకూడదు?" అన్నాడు మాన్‌ఫ్రెడ్ ఖచ్చితంగా.

—(ఇంకా ఉంది)

## అతనికంటె ఘనుడు

చిటకా వైద్యుడు తన దగ్గర ఉన్న "అమృతబిందు" అనే ఔషధం మహిమ వివరించాడు. "ఇందుకు నేనే నిదర్శనం. నాకు రెండు వందల ఏళ్లు. ఇంకా చెక్కుచెదరకుండా ఉన్నాను చూడండి" అన్నాడు.

ఆ వైద్యుని వంతగాణ్ణి పక్కకు పిలిచాడు ఒకాయన. ఒక రూపాయి చేతులోపెట్టాడు. "నిజం చెప్పండి. మీ గురువుకి నిజంగా అంత వయసు ఉందా?" అని అడిగాడు.

"నిజంగా నాకు ఆయన వయస్సు ఎంతో తెలియదండి. ఆయనదగ్గిర నేను కొలువుకి కుదిరి నూటయాభై ఏళ్లే అయింది" అన్నాడు వంతగాడు.

# చిత్రమాలిక

## పంతులు-శాస్త్రి

# సమస్య

మే నెల రెండవవారం; ఎండలు విపరీతంగా మండి పోతున్నాయి; ఏ రోజు కారోజు మధ్యాహ్నపు ఎండ బాధను భరించలేక, ఇవాళ ఇంత ఎండ కాసింది, సాయంకాలం తప్పక వాన పడుతుందని ఆశించడం జరుగుతూంది. ఆశించినట్టుగానే సాయంకాలం అయేసరికల్లా కొద్దిగా మేఘాలు కమ్ముకోడం, ఇక తప్పక వానపడుతుందని ఎంతో ఆత్రుతగా ఎదురు చూడ్డము మాత్రమేమిగిలేది. వేళకు ఎక్కడి నుండో గాలివచ్చి, కమ్ముకొన్న మేఘాలను చెల్లాచెదరుచేసి పారవేసేది. మహా అయితే ఆ సంరంభంలో ఒక రెండు చినుకులు పడేవి; వాటివలన భూమి చల్లబడక పోవడం అటుండగా రాత్రి ఉక్క మరీ ఎక్కువై బాధగా ఉండేది.

సర్వీసు ఎక్కువగా ఉన్నంతకాలం ఎప్పుడు 'యాభై' అయిదేళ్లు నిండుతాయా, ఎప్పుడు రిటైరయి హాయిగా విశ్రాంతిగా జీవితం గడుపుతామా అనిపించేది. కాని, తీరా వేళకి రిటైరు కావలసి వచ్చేసరికి మరొక్క రెండుమూడేళ్లు ఉద్యోగంలో ఉంటే ఎంత బాగుంటుంది అనిపించింది. చాలా తాపత్రయం పడినమీదట ఎలాగో ఒక సంవత్సరం ఉద్యోగం పొడిగింపు జరిగింది——

సంవత్సరాంత పరీక్షలు - మార్కులు - పరీక్షా ఫలితాలు ఈ గొడవలతోటే మొదటి వారం ఆఖరువరకూ గడిచిపోయింది. ఇంకా ఉన్నదల్లా మరొక నెలా పదిరోజులు విశ్రాంతి. శలవుల్లో ఇక్కడికీ అక్కడికీ చాలాచోట్లకి వెళ్లాలనుకొన్నాను గాని, ఎండల్లో ప్రయాణం అంటే జడిసి, నేను వెళ్లడానికి బదులుగా పిల్లల్నే ఇక్కడకు రమ్మని రాశాను. వాళ్ళింకా రావడానికి వారం పదిరోజులు పట్టవచ్చును. ప్రస్తుతానికి నేనూ మా శ్రీమతీ మాత్రమే ఇంట్లో ఉంటున్నాము.

మధ్యాహ్నం భోజనం అని పేరేగాని, బాగా ఎండెక్కిన తరవాత భోజనం చెయ్యడం కష్టంగా ఉంటుందని, పదిగంటల లోపునే భోంచెయ్యడం, ఆ వెంటనే ఒక్క గంట చిన్న కునుకుతియ్యడం, లేచి మధ్యాహ్నం మూడుగంటలవరకూ భారతం చదువుకోడం, కాఫీతాగి, ఎలాగో అయిదు గంటలవరకూగడిపి, క్లబ్బుకివెళ్ళి ఎనిమిది గంటలవరకూ కూర్చొని, వచ్చి భోంచేసి, పేపరుచదువుతూ పడుకోడం — ఇదీ ప్రస్తుత దినచర్య——

మధ్యాహ్నం మూడు దగ్గరగా అవుతూంది. భారతం సభాపర్వం చదువుతున్నాను. మా ఆవిడ ఏనాడో సత్యాగ్రహం రోజుల్లో ప్రారంభించి, ఇప్పటివరకూ సాగిస్తూన్న అలవాటుప్రకారం రాట్నం మీద దారం తీస్తుంది. రెండున్నర దాటాక కాఫీ పెట్టడానికి లేస్తానందికాని చదువుతున్న ఘట్టం చాలా రసవంతంగా ఉండడం చేత నేనే కాఫీకి తొందర్లేదు కూర్చొమన్నాను.

అటువంటిసమయంలో వచ్చాడు బ్రహ్మానందం.

బ్రహ్మానందం నా చిన్ననాటి స్నేహితుడు.

ఇంటర్మీడియేటువరకు కలిసే చదువుకున్నాము. తరవాత అతను చదువుమాని ఉద్యోగంలో ప్రవేశించాడు.

ఆ తరవాత మాకు అట్టే కలియడానికి సావకాశాలు లేకపోయాయి. ఈమధ్యనే సుమారు రెండేళ్ళయింది అతను రిటైరయి వచ్చి ఈ ఊళ్లో ఒక చిన్న ఇల్లు కొనుక్కొని ఒక్కడే ఉంటున్నాడు. భార్య పోయి అప్పుడే సుమారు పదేళ్ళయిందట.

వచ్చే కొద్ది జీతంతోనే కొడుకులందరికీ బి. ఏ. వరకు చదువులు చెప్పించాడు. కూతుళ్ళకి ఒకమాదిరి మంచిసంబంధాలే చేశాడు. రిటైరయినతరవాత వచ్చిన ప్రావిడెంటు ఫండుతో అదివరకుచేసిన అప్పులు తీర్చాడు; ఆఖరికూతురు పెళ్లి చేసేసేడు. మిగిలిన అయిదు వేలతోనూ ఒకమాదిరి నాసిరకమైన చిట్టమైన ఇల్లు కొన్నాడు.

> "చూడు బ్రహ్మానందం! ఇప్పటికప్పుడే నువ్వు ఎన్నో సంవత్సరాలుగా ఈపజిల్స్‌కింద డబ్బు తగలేస్తున్నావు. అందులో ఎన్నవ వంతయినా నీకు బహుమతుల రూపంలో వచ్చిందా? అదృష్టం ఒక్కమారుగా ఆకాశం మీంచి ఊడిపడాలనుకునేకంటె మన ఖర్చులోనే పొదుపుగా ఉండడం నేర్చుకుంటే...."

# ★ చిత్రమాలిక ★

ముగ్గురుకొడుకులూ అన్నారు, నీకెందుకు నాన్నా వేరే ఉండటం, మాదగ్గర నీయిష్టం వచ్చినచోట ఇష్టం వచ్చినన్నాళ్లుంటే సరిపోదా?' అని. సరే, వాళ్ళమాట ఎందుకు కాదనాలని ఒక ఆరునెలలపాటు ముగ్గురు కొడుకులదగ్గరా ఉండి వచ్చేడు; ఆ వరసనే ముగ్గురుకూతుళ్లదగ్గరా మొత్తం ఒక రెండు నెలలుండి వచ్చేడు. తరవాత, అదివరకు తన ఇంట్లో అద్దెకున్నవాళ్లచేత ఖాళీ చేయించి వేరే ఉండడం మొదలు పెట్టేడు. కొడుకులకు ఖండితంగా రాసేసేడు. 'నేను వచ్చి మీ ఎవ్వరిదగ్గరా ఉండడమన్నది మీకూ నాకూ కూడా సదుపాయం కాదు. మీరు ఒక్కొక్కరూ నెలనెలా ఇరవై రూపాయలచొప్పున పంపిస్తూఉంటే నాకు హాయిగా సరిపోతుంది. నేను ఉద్యోగం చెయ్యడానికంటే ముసలివాణ్ణని లెక్క వేసేరుగాని నాకింకా శరీరదార్ఢ్యం సడలి పోలేదు — ఎప్పుడో నాకు వీలున్నప్పుడు వచ్చి మిమ్మల్ని చూసి పోతూఉంటాను.”

అతనికొడుకులుకూడా జాగ్రత్తగలవాళ్లే. ప్రతినెలా క్రమం తప్పకుండా జీతం అందగానే మనియార్డరు చేస్తారు. ఎప్పుడయినా అంత చిరాకుగాఉంటే ఒక అయిదో పదో తగ్గించి అయినా పంపేవారుగాని అసలే మానేసేవారుకారు. అసలు బ్రహ్మానందానికి మామూలుగా కొడుకులుపంపే అరవై రూపాయలూ అవసరంపడేవి కావు. ఎప్పుడయినా ఏదైనా అగత్యం వస్తుందని మిగిలింది సేవింగ్సుబేంకులో వేసి ఉంచుకొనే వాడు.

అతనికి తగినవాడే, గవర్నమెంటులో బంట్రోతుపనిచేసి, రిటైర్ అయిన రామస్వామి అనే మనిషి దొరికాడు. అతనికి డబ్బును గూర్చిన ఆశ అట్టేలేదు. కొడుకులందరూ ఏవోపనులు చేసుకొంటున్నారు. తనకు ఏదో కాలక్షేపం కావాలి.

ఇద్దరూ కలిసి బ్రహ్మానందం ఇంటిచుట్టూ పూలమొక్కలూ పళ్ళమొక్కలూ నాటి పెంచడంలో తన్మయానందం పొందుతారు పసిపిల్లల్లాగ—

బ్రహ్మానందం తనవంట తానేచేసుకొనే వాడు. మధ్యాహ్నం ఒంటిగంటకుగాని భోజనం చేసేవాడుకాడు. మళ్ళీ రాత్రి ఎనిమిదిగంటలకి ఏదో ఫలహారంచేసి ఇన్ని పాలుతాగి పడుక్కునేవాడు—రామస్వామి కూడా సరిగా అతను భోజనంచేసే వేళప్పుడే వెళ్లి భోంచేసి వచ్చేవాడు—

రాత్రి అతను ఏదో చదివిచెప్పుతూఉండే వాడు. రామస్వామి అతనికి నిద్రవచ్చే పర్యంతం కాళ్లు పట్టి పడుకొనేవాడు.

అన్ని అంశాలలోనూ అతి నియమబద్ధంగా, ఏ జంజాటాలూ లేకుండా ఉండే బ్రహ్మానందానికి ఏదయినా దుర్వ్యసనం అంటూ ఉంటే అది పజిలుకింద డబ్బు తగలెయ్యడమే—

ఏవో మూడు నాలుగురకాల పజిల్సుకి కడుతూ ఉండేవాడు. నెలనెలా ఏ పదో పదిహేనో వాటికింద ఖర్చుపెడుతూ ఉండే వాడు.

నేను ఎప్పుడయినా స్కూలునుంచి ఇంటికివస్తున్నప్పుడు దార్లో వాళ్ళింటిదగ్గర కాస్తసేపు ఆగేవాణ్ణి.

ఇద్దరూ తోటపనిచేస్తానో, పజిల్సుసాల్వ్ చేస్తూనో కనిపించేవారు. వెళ్ళి వెళ్ళడంలో నన్ను సలహాలడగడం ప్రారంభించేవారు.

నేనొకనాడు అడిగేను—! తోటపనిలో అయితే మీ రామస్వామి ఘటికుడే కావచ్చునుగాని, పజిల్సు సాల్వ్ చెయ్యడంలో కూడా నీకు అతని సలహా పనికి వస్తున్నాదా ?”

“నీకు రామస్వామి అంటే సామాన్యుడుగా కనిపిస్తున్నాడు కాబోలు — చిన్నతనంలో అతనేగాని ఇంగ్లీషు చదువుకొని ఉంటే, ఎంతవాడయి ఉండునో, నేను తెలుగులో అర్థంచెప్పితే చాలును, అతను ఎంతబాగా ఆలోచిస్తాడనుకొన్నావు. ఒక్కొక్కప్పుడు నేను పట్టుదలకొద్దీ అతను చెప్పినమాట కాదని నేననుకొన్న మాటే వేస్తాను. నిస్సందేహంగా అతను చెప్పినదే రైటయి ఊరుకొంటుంది. ఇప్పటికలా అధమం అరడజను మార్లయినా జరిగింది.”

“అంచేత, ఇప్పుడు అతని సలహానే నమ్ముకుంటున్నావన్నమాట ?”

“లేదు; ఇద్దరంకలిసి ఆలోచించి, ఒక నిర్ణయానికి వస్తున్నాము.”

ఇదీ బ్రహ్మానందం పరిస్థితి.

మధ్యాహ్నం మూడుగంటలవేళప్పుడు బ్రహ్మానందం వచ్చేడంటే అతను వచ్చిన పనేమిటో నాకు వెంటనే తెలిసిపోయింది. కాని, వచ్చీరావడంతోనే వ్యవహారం మాట్లాడ్డం బాగుండదని “రావోయి, బ్రహ్మానందం! రా కూర్చో; ఎండలు మహా తీవ్రంగా ఉన్నాయి; పడుకొంటే చెమటతో తడిసిపోడమేగాని, నిద్రపట్టదు. అందుచేత భారతం చదువుకుంటున్నాను.”

“నిద్రపట్టకపోయినా పక్కమీద అటూ ఇటూ దొర్లేకంటే భారతం చదువుకోడం చాలా మంచిపని... నేను...కొంచెం పని మీద వచ్చేను.”

“సర్లే దానికేం, కాస్త కాఫీతాగి వెళ్దువుగాని, అందాకా నువ్వు కాస్తసేపు చదవకూడదూ? నేను ఏదో చదువుతానుగాని, నీవంటి సంగీతజ్ఞానం ఉన్నవాడు రాగధోరణితో చదివితే మరీ బాగుంటుంది. ఏమి

కవిత్వం రాసేరయ్యా, నన్నయ్యగారు! ఇటువంటి కవిత్వం చదువుతున్నప్పుడే 'నా ఋషిః కురుతే కావ్యమ్' అన్న సూక్తిలోని సత్యం గోచరిస్తుంది. చదువుతావా?"

చదవడానికేముందిగాని, నేను అవతల పోస్టాఫీసుకి వెళ్ళవలసివుంది. ఏం చేశాడో మా చిన్నవాడు ఈ నెలకూడా పంపలేకపోయాడు. గత నెల మా రెండవపిల్లా అల్లుడూ ఈ దారినివెళ్తూ ఇక్కడ దిగేరు. వాళ్ళకి బట్టలూ అవీ కొనడంతో నా దగ్గరున్నది కాస్తా అయిపోయింది. అయినా మరొక వారం రోజుల్లో మా పెద్దవాడి దగ్గరనుండి మనియార్డరు వస్తుంది తప్పకుండా, రాగానే...

"సరే, సరే, దానికేంలే, ఇప్పుడు ఎంతయితే సరిపోతుంది? ఒక ఇరవై చాలునను కుంటాను."

"ప్రస్తుతానికి ఒక పదే చాలునుగాని, ఇరవై ఇయ్యి; మావాడు పంపగానే..."

"మీవాడు పంపగానే కాకపోతే, నీకు పజిలు డబ్బు వచ్చిన తరువాతనే ఇయ్యి; ఇప్పుడే ఇమ్మంటావా కాస్త కాఫీతాగి వెళ్ళకూడదా?"

"నాకు ఇటువంటి సమయంలో కాఫీ తాగడం అలవాటులేదు. అసలు నేను భోజనం ఒంటిగంటకి చేస్తాను. అయిదు గంటలకిగాని కాఫీ తాగను - పోస్టాఫీసుకి వేగం వెళ్తే మంచిది."

రెండు పదిరూపాయలనోట్లు తెచ్చియిచ్చాను.

ఇస్తూ కాస్త హితబోధ చెయ్యకుండా ఉండలేకపోయాను.

"మామా, బ్రహ్మానందం! నీకొడుకులూ, కూతుళ్లు, మనవలూ, మనవరాళ్లు - వీళ్లంతా ఉన్నారు. వాళ్ళలో ఎవరికికానీ, ఈ నెల నెలా నువ్వు ఖర్చుచేసే పది పదిహేను ఎంతగా ఉపయోగించగలవో, ఎంతటి ఆనందం చేకూర్చగలవో ఆలోచించు. ఇప్పటికప్పుడే నువ్వు ఎన్నో సంవత్సరాలుగా వీటికింద డబ్బు తగలేస్తున్నావు. అందులో ఎన్నవవంతయినా నీకు బహుమతుల రూపంలో వచ్చిందా? అసలు ఒక్కమారుగా ఆకాశంనుంచి ఊడిపడాలనుకునేకంటె మనఖర్చు వెచ్చాలలోనే బాగుపడగా ఉండటం నేర్చుకుంటే..."

"ఈమాటలన్నీ నాకు నేనే ఎన్నోమార్లు చెప్పుకొన్నవే. అయితే నేను నా స్వల్ప జీతంలో నాకు నాటికి అవసరమయిన ఎన్ని సుఖాలను, సహపాఠీలకూ త్యాగం చెయ్యబట్టి వాళ్ళను ఇంతవాళ్ళను చేసేనో ఆ భగవంతుడికే తెలుసును కాకపోయినా నేను నా భోజన భాజనాదులకింత, ఇంతకంటె ఎంతగానో ఖర్చుపెట్టేఉంటే ఎవ్వరూ ఏమీ అనరు. అనుకోరు. నాకు ఏ ఇతరవ్యాసంగమూ ఇవ్వలేని మానసిక తృప్తినీ, పరిశ్రమను విశ్రాంతినీ ఇస్తున్నది - అంతేకాదు, నాకేమో నమ్మకం ఉంది, ఎప్పటికయినా వీటిలో ఒక పెద్ద బహుమతి వచ్చి తీరుతుందని - మరి నే వస్తాను...మావాడు పంపగానే వారం పది రోజుల్లో నీ డబ్బు నీకిచ్చేస్తాను"...

అన్నప్రకారం వారంరోజులనాటికి రామస్వామిచేత ఇరవై రూపాయలు పంపించాడు -

కాలం గడిచిపోతూంది -

నా ఉద్యోగపు పొడిగింపు కాలంకూడా పూర్తి అయింది. ఏం చెయ్యడానికీ తోచక, నిర్వ్యాపారంగా కూర్చోడానికి ఇష్టపడక తంటాలుపడుతున్న సమయంలో ఎవరో పుస్తకాలకంపెనీ వాళ్లు పేజీకి రూపాయి చొప్పున ఇస్తామంటూ ఏవో పాఠ్యపుస్తకాలు రాయమన్నారు - వాళ్ళిచ్చే ప్రతిఫలంమాటకంటెకూడా, ఏదో సార్థకమయిన పని కొంతకాలమన్న సంతోషంతో న్యాయంగా పడవలసినదానికి పదింతలు శ్రమపడి, రాసినదే పదిమార్లు సాపురాసి రోజంతా పనిలో మునిగి తేలుతున్నాను -

ఇటువంటి సమయంలో ఒకనాటి మధ్యాహ్నం మా శ్రీమతి వార్త తీసుకొనివచ్చింది.

"మీ కింతసేపూ మీ పుస్తకాలగోలే మే- బ్రహ్మానందం గారికి పాతిక వేల రూపాయలు వచ్చేయట"

నేను కొంతసేపు నమ్మలేకపోయాను —

ఊరంతా అప్పుడే పాక్కుని పోయిందనీ ఇందులో ఏమీ సందేహం లేదనీ మా శ్రీమతి నమ్మకం కలిగేలా చెప్పింది —

అయినా ముంజేతి కంకణానికి అద్దమెందుకని, నేనే కాఫీతాగి బయలుదేరేను.

వెళ్ళేసరికి వాతావరణం ఎప్పటిలాగే ఉంది. పాతిక వేలు హఠాత్తుగా వచ్చిపడిన కళ ఎక్కడా గోచరించలేదు.

బ్రహ్మానందం, రామస్వామి ఇద్దరూ తోటపనిలో నిమగ్నులయి ఉన్నారు.

తాము వేసి పెంచిన సపోటాచెట్లు కాపు పట్టింది బంగినపల్లి మామిడిచెట్టు. ఇంకా బాగా చిన్నదే — ఒక పాతిక కాయలకంటే ఎక్కువ లేవు. కాయలన్నీ పరువుకి వచ్చేయి —ఒక రెండు చెట్టునే పండిపోయాయి నాటిని కోయడపు ప్రారంభోత్సవపు హడావుడిలో ఉన్నారిద్దరూ —

నన్ను తోటచూపించి తన్మయత్వంతో చెప్పే కబుర్లు వినే ఓపిక లేకపోయింది నాకు.

సూటిగా ప్రశ్నించాను. అదేమంత ముఖ్యమయిన విషయం కానట్టే, మొదటి బహుమతి వచ్చినట్టు టెలిగ్రాము వచ్చిందనీ, పది పదిహేను రోజుల్లో చెక్కు రావచ్చుననీ చెప్పి, మళ్ళీ తమ తోటను గూర్చిన ప్రశంసలో పడ్డారు.

బంగినపల్లి మామిడిపండు ముక్కలూ, తమ కృషి ఫలితమయిన ఎర్రరటిపస్కా తినందే కదలనియ్యలేరు నన్ను — నేను వాటిని తింటూ యథాశక్తి అతని అదృష్టానికి సంతోషాన్ని వెలిబుచ్చి బైటపడ్డాను.

ఇంత కాలం నిరంతరం పరిశ్రమించి పొందలేని డబ్బును, ఎన్నడూ ఒక్కమారుగా స్వంతమని కళ్ళజూడనంత డబ్బును అతి సునాయాసంగా అతను సంపాదించగలిగేడంటే, అతను స్నేహితుడే అయినప్పటికీ సంతోషంకంటే ఈర్ష్యే మాత్రమే ఎక్కువగా కలిగించనాలి. ఆరు నెలలాయి ఈ పుస్తకాల రచనతో సతమతమవుతున్నాను; ఇంతా చేసి వీటివల్ల వచ్చేది మూడు నాలుగు వందలకంటే ఎక్కువ లేదు - లక్ష మందిలో ఏ ఒక్కడికో తప్ప అవకాశం ఉండదని తెలిసీ, ఏమో ఆ ఒక్కడూ మనమే కాకూడదా అన్న భ్రాంతితో, నెలకి అయిదు రూపాయలకంటె ఎక్కువ ఖర్చు పెట్టకూడదన్న నిశ్చయంతో పజల్సు సాల్వుచేసే ప్రయత్నంలో పడ్డాను.

బ్రహ్మానందానికి మొదటి బహుమతి వచ్చిందని విని అప్పటికింకా నెల్లాళ్ళకంటె ఎక్కువ కాలేదు.

ఒకనాడుదయం నేను రాసిన పుస్తకం పబ్లిషర్సుకి పంపించడానికి కట్టగ అదీ తయారుచేస్తూఉండగా వచ్చాడు బ్రహ్మానందం.

"నేనెందుకు బ్రతికిఉన్నాను? అనే శీర్షికతో ఒక కవి ఒక పద్యం వ్రాసి ఒక పత్రికకు పంపాడు.

తిరుగు టపాలో అది తిరిగి వచ్చింది. దానికి జతపరచిన చీటీలో ఇలా ఉంది: "మీ పద్యం మాకు నచ్చక అచ్చు వెయ్యటంలేదు. కాగా, మీ ప్రశ్నకు మా జవాబు:- మీరు ఈ పద్యాన్ని స్వయంగా పట్టుకొచ్చి ఇవ్వకుండా టపాలో పంపారు కాబట్టి."

# ★ చిత్రమాలిక ★

అతను వచ్చి కూర్చొని, "నీపని కానీ, తరవాత నే మాట్లాడుకొందా"మన్నాడు.

సంగతి ఇది - అతని కొడుకులూ కూతుళ్లు అందరూ వచ్చి కూర్చున్నారు - తనకేమో ఇల్లు ఇల్లులా కనిపించడం లేదట. వాళ్లలో వాళ్లకు పరస్పరం ద్వేషం, అనుమానం, కోపం—

ఈ హఠాత్తుగా వచ్చిపడిన పెన్నిధి ఎక్కడ తమకి కాకుండా పోతుందో అని - అందరూ తనను వచ్చి తమదగ్గర ఉండమని బలవంత పెట్టేవాళ్ళనట—

ఎవరిమటుకు వాళ్లు తమకి ఉంటే ఇబ్బందులూ, డబ్బు కావలసి వచ్చిన అవశ్య పరిస్థితులు చెప్పుకొని, అందరిలోకీ తామే అర్హతములయినట్టుగా నమ్మింపజెయ్యాలని తాపత్రయమట!

అతనికి వచ్చిన ఈ చిక్కులకి నాకు ఒకమూల విచారం కలుగుతూఉన్నా ఇంకొకమూల సంతోషం కలక్కపోలేదు. డబ్బు డబ్బు డబ్బు అని అఘోరించడమే గాని ఎంత డబ్బు వచ్చినా తృప్తిఉండదు; మనస్సుకి శాంతి విశ్రాంతి ఉండవు అనే పుల్లద్రాక్షపళ్ళ వేదాంతం కొంతపని చెయ్యకపోలేదు.

నేను ఏవేవో కుంటిసలహాలు చెప్పకపోలేదు - కాని, అతను వాటిని లక్ష్యపెట్టినట్టు లేదు - విశ్రాంతిగా కూర్చొని ఆలోచించుకొందికే మా యింటికి వచ్చినట్టుంది - తన అలవాటుకి విరుద్ధంగా ఆ వేళ ఆ సమయంలో నేనిచ్చిన కాఫీతాగి అలా పదకొండు గంటలవరకు మాట్లాడకుండా కూర్చున్నాడు.

మరి వారంరోజులనాడు నేను క్లబ్బుకి వెళ్తొంటే పిల్చాడు - ఇల్లు వెనుకటి మాదిరిగానే ఉంది; రామస్వామి తనూ ఈమధ్యనే మనవలూ మనుమరాళ్లూ పాడుచేసిన తోటని సరిచేసుకొంటున్నారు—

నే నడక్కుండానే బ్రహ్మానందం చెప్పాడు—

"ఆ వేళ మీ యింటికివచ్చి కూర్చొని ఆలోచించడం చాలా మంచి పనయింది. సమస్య అతిసులువుగా పరిష్కారమయి పోయింది—"

డబ్బువచ్చినా ఇబ్బందులు తప్పలేదని తా నంత తృప్తికరంగా ఉన్నా నాకు అదే మిటో లాగనిపించింది. అంత సులభంగా సమస్య పరిష్కారమయి పోయిందంటే - నిజంగా నే పరిష్కారమయి ఉండాలి; లేకపోతే, కూతుళ్లు, కొడుకులూ అంతా ఎందుకు వెళ్ళిపోతారు?

ఏదో అనకపోతే బాగుండదని, "అయితే నేను చెప్పినట్టు అందరికీ సమానంగా పంచి పెట్టేవా, కూతుళ్ళకి కొంచెం తగ్గించేవా?"

"ఎవ్వరికీ ఏమీ ఇవ్వలేదు"

"అయితేమరి సమస్య ఎలా పరిష్కారమయింది?"

"అక్కడే ఉంది గమ్మత్తు: ఆ వేళ మీ యింట్లో కూర్చొని ఆలోచించానా, ఆమధ్యాహ్నమే వెళ్లి బేంకులో అంతా ఫిక్సడు డిపాజట్టు చేసేసేను"

"అయితే మీపిల్లలేమీ అనలేదూ?"

"లోపల ఏమైనా అనుకున్నారేమోగాని బైటికి ఏమీ అనలేదు. అంతేకాదు. తమకి కాకపోయినా, మరొకళ్ళకి దక్కపోలేదు కదా అని అందరికీ సంతోషంగానే ఉంది. బేంకు వాళ్ళిచ్చేవడ్డీ నెలనెలా వచ్చేలాగ ఏర్పాటుచేసుకొన్నాను. సుమారు నూరు రూపాయలువస్తుంది. ఇదివరకు మావాళ్లు నాకు నెలనెలా పంపించేది పంపించవక్కరలేకపోవడమే వాళ్లకి మిగులు—

"బాగానే ఉందిగాని ..."

"నాకు తెలుసును, వాళ్లు నేను ఎప్పుడిదంతా విడిచిపెట్టి వెళ్లిపోతానాఅని కోరుకుంటూ ఉంటారని...కాని, అసలు నేను మాత్రం కోరుకొంటున్న దేమిటి, ఇలా బలంగా, శారీరకంగా ఒకళ్ళమీద ఆధారపడకుండా ఉన్న సమయంలోనే అనాయాసంగా వెళ్ళిపోవడంకంటె కోరుకోదగినదేముంటుంది. అసలిప్పుడు నేను మరి పజిల్సుకి కట్టడంకూడా లేదు తెలుసునా?

"నిజమే? అందులోనూ ఇంత పెద్ద బహుమతి వచ్చేక—"

"ఇదివరకల్లా బైటికి ఎలాఉన్నా లోపల పిల్లలు పాపలూ అనుభవించవలసిన డబ్బును దుర్వినియోగం చేస్తున్నానన్న బాధఉండేది. అయితే, ఎంతో కొంత, అధమం నేను ఖర్చుపెట్టిన పాటైనా తిరిగివస్తే చాలుననిపించేది—ఇప్పుడు మరి ఆ విచారం లేదు. నాఖర్చులూ మునపట్లాగే ఉన్నాయి. నెలనెలా అంతో ఇంతో మిగులుతోంది. అయితే "ఇప్పుడీ మిగులుతున్న డబ్బుని ఎవరికింద ఎంతఖర్చుపెట్టడమా అన్న సమస్య ఇంకా పరిష్కారం కాలేదనుకో"

భగవంతుడు నాకూ మిగిలిపోయిన డబ్బును ఎలా ఖర్చుచెయ్యడమా అన్న సమస్యను కలిగిస్తే ఎంతబాగుండును. ★

---

**బం**గారమ్మ రవ్వల ఉంగరం చేయించుకుంది.

మధ్యాహ్నం, కబుర్లకొచ్చిన అమ్మలక్కలెవరూ 'ఉంగరం కొన్నారా' అని అడగలేదు. తనంతట తను చెప్పడం ఆవిడకు ఇష్టంలేదు.

"అబ్బ. ఉక్కపోస్తోంది బాబూ. ఈ రవ్వల ఉంగరం తీసిపారేస్తా" అందావిడ హఠాత్తుగా.

---

# చండీదాసు హితోపదేశం

నిదానంగా ఆలోచించలేని రోజుల్లో దానయ్య ఒక జానకమ్మని వరించి ముచ్చటకొద్దీ చాంద్ బీబీ అని పిలుచుకునే వాడు. పెళ్ళయిన కొన్నాళ్ళలో నే పేరు పొరపాటని చటుక్కున గ్రహించి 'చండిక' అని పిలవాలని ఉబలాటపడ్డాడు కాని, ఆనాటికే ఆమె చేతులో కీలుబొమ్మ అయిపోయాడు. దరిమిలా చండీదాస బిరుదాంకితుడయ్యాడు. చాంద్ బీబీ ఉరఫ్ చండిక నిద్రలేచేసరికి స్నానాదికాలు ముగించి కాఫీ చేసేస్తాడు దానయ్య. ఆమె, ముందు లేస్తే దానయ్యపూ గ్యాపరాలగురించి అష్టోత్తర శతనామావళి అంత అనర్గళంగా చదవేస్తుంది. అందువల్ల అతనే ముందర లేస్తాడు.

కందా, మామిడి కాయ, వగైరాజాతి కూరలకి దానయ్య చెక్కు తీసి పెడతాడు. పూర్వం ఒక సారి చండిక ఇటువంటి బండపని చేసేసరికి చేతులు కంది పోయాయి. ఒక సారి బొటనవేలు తెగింది. ఆరోజున చండిక కెంపంగి సూర్యుడిలా ప్రేలేగిపోయింది. దానయ్య ఆ రోజున ఉపవాసం, ఆ మర్నాడు లంకణం చేశాడు. మొదటి రోజు తరిగి రెండవరోజు వండిన కూరను చండిక బలవంతంమీద మూడోరోజున ఆరగించాడు.

"ఈ కూరని వెయ్యి నాలుక లున్నవాడు కూడా మెచ్చుకోలేడు" అన్నాడు అప్పటికి రెండు నాలుకలతో మాట్లాడ నేర్చిన దానయ్య. అతనికి రెండు నాలుకలూ దురద పెట్టాయి. మొదటిది కందకూర ప్రభావం వల్ల రెండోది, రెండురోజులు తిండిలేదు గదా అని చండిక కొప్పమించిగా ఉండడం వల్ల.

కందకూర తింటూ వెయ్యి నాలుక లున్నవాడు కూడా దీన్ని మెచ్చుకోలేడని దానయ్య అన్న మాటలలో రెండర్థాలు కనబడడంతో చండిక మండి పడింది.

ఆ తరవాత దానయ్య నోట్లో నాలిక లేని వాడయిపోయాడు. తెల్లవారకుండా నిద్ర లేవడం, స్నానాదికాలు ముగించడం, కందా కాకరకాయవంటి కూరలన్నీ దురదా చేదూ అనకుండా నోరుమూసుకు ఆరగించడం వంటి పనో అలవరచుకున్నాడు.

కొన్నాళ్ళకి కొడుకును కన్నాడు. ఆ కొడుకు పాతికేళ్ళవరకూ అమ్మ చెప్పు చేతుల్లో బంగారుబొమ్మల్లె బాచాలకొండల్లె పెరిగి, హఠాత్తుగా ఒకనాడు పెద్దవాడై, అమ్మ నెదిరించి, కాలేజిలో ఓ అమ్మాయిని ప్రేమించి మరీ పెళ్ళిచేసుకున్నాడు. దరిమిలా బస్తీలో కొలువుకి కుదిరి కాపరం పెట్టాడు. దానయ్య అడపాతడపా బస్తీవెళ్ళి కొడుకు సంసారం తీరుతెన్నులు చూచి, భార్యకా భోగట్టా చెబుతూ వుండేవాడు. కొత్తలో దానయ్య, 'జానకమ్మ ఉరఫ్ చాంద్ బీబి అనే చండిక'ల సంసారంలాగే అన్యోన్యత కనబడింది. దరిమిలా కనబడడం మానేసింది. ఏడాది తిరిగేసరికి కొడుకునే పైచెయ్యిగా చెలామణీ అవుతున్నట్లు ఊహ తోచింది దానయ్యకి. వింతగా కనబడింది.

ఒకరోజున 'చండీదాస మండలి'లో ఈ ఊహ బయటపెట్టాడు. చండికవంటి భార్యలు గలవారంతా ఈ మండలిలో సభ్యులు. తమ భార్యలు ఎలా రాసి రంపాన పెట్టేదీ వెళ్ళబోసుకుంటారు. ఈ గోష్ఠికి రాగలగడం ఒక సుఖం. కాబట్టి, ఈ సౌఖ్యానికై తామెంత కష్టపడ్డదీ చెప్పుకుంటారు. మండలి సభ్యుల పేర్లు (గోష్ఠిలో మాత్రమే) చండీదాసు, ఉమాపతి, రమాపతి మొదలైనవి. అన్నీ భార్యల పేర్లనుబట్టి ఏర్పడుతాయి. ఒక చండీదాసు చెప్పే కష్టాలు విని, మిగతా వారిలో కొందరు సానుభూతి, ధైర్యసాహసోపేతులైనవారు సలహాలూ ఇస్తారు - పెళ్లాలకు తెలిస్తే తెలిసిందిలే అన్న ధీమాతో.

దానయ్య ఒకనాటి గోష్ఠిలో తనకొడుకు కాపరం ముచ్చట చెప్పి, "ఏడాది తిరిగినా మావాడిదే పైచెయ్యి సుమండీ" అన్నాడు. సదస్యులంతా ఇది సాధ్యమా, సంభవమా అని విస్తుపోయారు—మానవాళి భవిష్యత్తుకి అది మంచిదో చెడ్డదో ఎవరూ నిర్ధారణ చెయ్యలేకపోయారు.

"మా ఆవిడని కనుక్కొని రేపు చెబుతాను" అన్నాడు దానయ్య చివరకి.

ఆరాత్రి అతను ఇంటికి వెళ్ళేసరికి ఆవిడ ఎన్నడూ లేనంత ఆదరంతో అన్నం పెట్టింది.

"అబ్బాయి వచ్చి వెళ్లాడు" అంది.

"ఎప్పుడూ" అన్నాడు దానయ్య.

"ఎప్పుడేమిటండీ నా బొంద. సాయంత్రం మీరు ఊరికే దాకా రాలేదని మీకు తెలుసు గదా. ఇప్పుడు మీరొచ్చాక నేను చెబుతే, ఎప్పుడూ అంటూ అడుగుతా రేమిటండీ. అయినా దృష్టి ఇక్కడుంటేగా" అంది ఆవిడ.

దానయ్య, ముహూర్తబలం అనుకూలంగా లేదని గ్రహించి నోరుమూసుకున్నాడు.

"కోడలు పిల్లవాణ్ణి రాసి రంపాన పెడుతూందట నిత్యం పోరేనట. కుర్రాడు దాంతో వేగలేక చిక్కి సగమైపోయాడు. కొంపు కొస్తూ ఇక్కడ ఆగి ఇవన్నీ నాతో చెప్పుకు పోయాడు ఇదేపో మూసుకున్నా నాగన్న. వాడు యతిఅంటే అది ప్రతిఅంటుందిట... వాడేం ముగుడనుకుందో నౌకరీ వెధవను కుందో" అంది జానకమ్మ ఉరఫ్ చండికేశ్వరి.

తన కళ్ళకి వీరాధివీరుడుగా కనబడ్డ కొడుకు నిజంగా అంతటివాడు కాడని భార్యవల్ల గట్టిగా తెలుసుకోగానే తన అంచనాలు వేసే శక్తి ఎంతగా దెబ్బతిందో, ఆలోచనాశక్తి ఎంత కుదించుకుపోయిందో దానయ్యకు కొంత స్ఫురించింది.

'అన్యోన్య దాంపత్యం' స్థిరపడడానికి తన కొడుకు ఇంకా అన్నిఘట్టాలూ దాట

"గట్టిగా చివాట్లు వేశారా?" అంది చండిక.
"మొహం వాచేలా." అన్నాడు చండీదాసు.
మావగారి జీవితం చూసి కోడలు, కోడలు కాపరం చూసి అత్తగారు, పొరపొచ్చెం లేని కాపరానికి కీలకం గ్రహించారు.

◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆

రవణ

◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆

# ★ చండీదాసు హితోపదేశం ★

**తీర్పు**

"అడుక్కు తినమని తిట్టాడండి" అని ఫిర్యాదు చేశాడు ఒక ఉద్యోగి తోటి ఉద్యోగిమీద.

మేనేజరు చాలాసేపు ఆలోచించాడు. "అంటే అన్నాడు. అడుక్కు తినొద్దులెండి" అన్నాడు గంభీరంగా.

లేదని తట్టింది. దాటించేయడం ఎంతసేపులే అనుకున్నాడు.

దానయ్య ఆవకాయముద్ద ఒకటేనమిలి మింగేలోగా ఆవిడ, "రేపే మీరూ బస్తీ వెళ్ళండి. వెళ్ళి దానికి మొహం వాచేట్లు చివాట్లు వెయ్యండి" అని రెండు ఆజ్ఞలు 'లేకపోతే, నేనేబయల్దేరి దానిసంగతి కనుక్కుంటా' అని ఒక హెచ్చరిక జారీ చేసింది.

వెళ్ళినపుడు నడిచి వెళ్ళమంది. వచ్చినపుడు పడవమీద రావడానికి రేవుడబ్బు లిచ్చింది. దానయ్య మర్నాడు తెల్లవారుతూ ఉండగానే తరవాణీ అన్నం తినేసి, కండువా భుజాన వేసుకుని, ధైర్యం కాఠిన్యం మొహాన పులుముకొని పట్నం బయల్దేరాడు. కాలవవొడ్డు చేరగానే శుభ్రంగా మొహం కడుక్కొని ప్రయాణం కొనసాగించాడు. ఉదయం ఎనిమిది వేసేసరికి అడంగి చేరి తలుపు తట్టాడు.

కోడలికి మావగారంటే ఎంతో గౌరవం. తన తండ్రిఅంత మంచివాడని మంచి నమ్మకం. అందుకని, తలుపుతీసి మళ్ళా నిద్రపోకుండా వెంటనే మొహం కడుక్కొని, కాఫీచేసి, ఆయన కిచ్చింది.

దానయ్యకి కాఫీ అంటే పంచ ప్రాణాలూనూ. అయినా ఆ రోజుదయం తరవాణీ దాహం పుచ్చుకుని బయల్దేరాడు. సరే కాఫీతాగి, కోడలి కుశలం అడిగాడు: "మా వాడసలే పెంకి వెధవమ్మా. సరిగ్గా ఉంటున్నాడా?" అన్నాడు.

కోడలు సంతోషపడి సొద విప్పింది... ఆయన అస్తమానం విసుక్కుంటారు. పొద్దున ఎనిమిదయినా అవకుండా నిద్ర లేవాలంటారు. యతంటే ప్రతంటారు....

"ఒకటేమిటి. రాసిరంపాన పెడుతున్నారనుకోండి మావయ్యా. నేనుకాబట్టి సర్దుకుని పొరపొచ్చం లేకుండా రోజులు వెళ్లబుచ్చుతున్నాను" అంది.

దానయ్య గుండె కరిగి నీరైపోయింది.

"రాలుగాయి వెధవ. రణపెంకి వెధవ. నిన్నిలా బాధలుపెట్టి, నిన్న మా యింటికొచ్చి మీ అత్తగారితో నీ మీద చాడీలు చెబుతాడూ, తప్పుకాదూ .... మొగుణ్ణికొట్టి మొగసాలెక్కినట్టు ... అమ్మడూ చూడు. ఈ ముక్క నేనన్నట్టు మళ్లా ఎక్కడైనా అనేవు సుమా" అన్నాడు.

"అనను మావయ్యా ఒట్టు. కాపరం చక్కపెట్టుకునే మార్గం చెప్పండి మావయ్యా" అంది కోడలు ప్రాధేయపూర్వకంగా.

"మార్గాలు నాకు తెలీవుగాని నేను గడించిన ముప్పైఏళ్ల అనుభవం చెబుతా. కీలకం తెలిసి మసలుకుంటే మీ ఇద్దర్నీ చిలకాగోరింకలంటారు. నలుగురూ అన్యోన్య దాంపత్యం అంటారు. ముచ్చటైన కాపరం అని ముచ్చట పడతారు" అంటూ దానయ్య తన 30 ఏళ్ళ సాంసారిక జీవనానుభవాలను చెప్పాడు.

"వేయేల. నన్నూ మీ అత్తగారినీ ఆదర్శంగా తీసుకో. మా కాపరంచూసి కీలకం తెలుసుకో" అని హితోపదేశం చేశాడు.

కోడలమ్మ నోరూరగ చవులుబుట్ట వింది.

రాత్రి దానయ్య ఇల్లుచేరగానే 'గట్టిగా చివాట్లేశారా' అని అడిగింది భార్య.

"మొహం వాచేలా. నెల తిరగనీ" అన్నాడు దానయ్య కఠినస్వరంతో. అప్పటికి ఆ పైన మాట్లాడడానికి చండిక కూడా ఒక్కరవ్వ జంకింది.

* * *

నెల తిరిగేసరికి కొడుకు కోడలూ ఇంటికి వచ్చి రెండురోజులున్నారు. వాళ్ళ కాపురం పొరపొచ్చం లేకుండా సాగిపోతున్నదన్న సంగతి ప్రతిమాటలోనూ కనపడింది చండికకు. కొడుకు ప్రయోజకుడై పెళ్లాన్ని అదుపాజ్ఞల్లో పెట్టినందుకు మొదటిరోజు సంతోషించిందావిడ. రెండోరోజు వీళ్లిద్దరూ ఒక్క తాటిమీద ఎలా నడవగలుగుతున్నారు చెప్మా అనుకుంది. మూడోరోజున, కోడలు పట్నం వెళ్ళిపోతామంది. అంతకుముందే ఇంకో రెండురోజులుంటానన్న కొడుకు అర్జెంటు పనుంది అన్నాడు!

* * *

ఆరోజు రాత్రి చండిక అన్నం వడ్డించి దానయ్యను యీ విషయమై కదలేసింది. దానయ్య గంభీరంగా నవ్వి, 'మా కోవా నా చివాట్ల ప్రభావం. కోడలుపిల్ల పిల్లిపిల్ల అయిపోయింది' అన్నాడు.

చండిక పెదవి చప్పరించింది.

"ఏమోసుమండి. అబ్బాయి కోడలుతో మాట్లాడినప్పుడు వాడి మొహంలో మీ ఛాయలే కనబడుతున్నాయి. ఉన్నమాట చెప్పాలంటే, ముమ్మూర్తులా మీలా తయారయ్యాడనిపిస్తుంది" అంది.

కీలకం బయటపడిందనగానే దానయ్య మొహం ఒక్కరవ్వ చిక్కపోయింది...

"ఇదా మీరుచేసిన నిర్వాకం," అంది చండిక గుట్టు కనిపెట్టేసి.

దానయ్య ఆరోజు అర్ధాకలితో పడుకున్నాడు. మర్నాడు ఉపవసించాడు. మూడోనాడు లంకణం చేశాడు. ★

న్యాయ: అయితే, ఈ ఆసామి ఆ అబ్బాయిని కొడుతూ ఉండగా నువ్వు చూశావన్న మాట.

సాక్షి: మరేనండి. చితక బాదేశాడు పాపం.

న్యాయ: నువు చూస్తూ ఊరుకున్నావా?

సాక్షి: లేదండి. డజన్ అగ్గిపుల్లలు తగలేసి, అతికష్టంమీద చుట్ట ముట్టించుకున్నానండి.



శాంతినికేతన్‌లోని ఒక సుందరశిల్పం



“జగతః పితరౌ...



చిత్రకారుడు: శ్రీకృష్ణ—సుబ్రావు.





ఎ. వి. ఎమ్.
వారి "నాగుల
చవితి"
తెలుగు
చిత్రంలో
జమున.







"[illegible]హారా" లో
ఉషాకిరణ్.



# బొంబాయి సినిమా లేఖ

బొంబాయిరాష్ట్ర మహిళా మండలి ఏర్పాటుచేసిన బాల చలనచిత్రోత్సవాలకు ముఖ్యమంత్రి శ్రీ మురార్జీదేశాయ్ ఈ నెల 4 వ తేదీన ఈరాస్ థియేటర్‌లో ప్రారంభోత్సవం చేశారు. ఉత్సవాలకు హాజరయిన బాలబాలికలకు, చలనచిత్ర పరిశ్రమ ప్రముఖులకు, ఈ ఉత్సవసందర్భంలో ప్రదర్శనకు తెప్పించిన వివిధ దేశాల చిత్రాలలో కొన్ని భాగాలను చూపించారు డిశెంబరు 3 నుండి 15 వరకూ ఇక్కడ ప్రదర్శించిన చిత్రాలలో కొన్ని : రష్యా-ఇద్దరు స్నేహితులు, జెకోస్లోవేకియా-కలర్ కార్టూన్ చిత్రం, బ్రిటన్-తుది గెన్నూక్య, సీక్రెట్ కేవ్, జపాన్-ఫ్యూగోటాకి తాయ్‌షా (అనాధ బాలకుల కథ) చైనా-డివో ఓడ్ ఫ్రెండ్ (కార్టూన్), ఇటలీ-బాగ్దాద్ గులాబీ (అరేబియన్ నైట్స్ కథ)

చలనచిత్రాలపట్ల పిల్లలకు చక్కటి అభిరుచి పెంపొందించడానికై, ఈ మహిళా మండలి ఉపన్యాసాలుకూడా ఏర్పాటు చేశారు.

* * *

రష్యా భారతదేశాల మైత్రీ సంబంధాలను పెంపొందించడానికి భారతీయ చలనచిత్రాలు దోహదం చేసినవని సోవియట్ నాయకులు మార్షల్ బుల్గానిన్, నికితా కృష్చేవ్‌లు ప్రశంసించారు మనదేశంనుండి పంపిన చిత్రాలు రష్యాలో బహుళ జనాదరణ నందుకున్నాయి ఇటీవలే, మూడు భారతీయ చిత్రాలను కొనాలని రష్యా కళా మండలి నిశ్చయించిన సంగతి తెలిసినదే. భారత చలనచిత్రప్రతినిధివర్గం ఒకటి అక్కడ పర్యటించి వచ్చింది.

ఇటీవల బుల్గానిన్ కృష్చేవ్‌లు బొంబాయివెళ్లినపుడు వారిగౌరవార్థం చలనచిత్రపరిశ్రమ ప్రముఖులు రెండుపార్టీ విందుచేశారు. ఒకటి టర్ఫ్‌క్లబ్‌లో జరిగింది. ఈ సందర్భంలో వైజయంతిమాల నృత్యంచేసింది. సోవియట్ నాయకులు ఆమె నృత్యాన్ని మెచ్చుకున్నారు. వీరి వెంటవచ్చిన రష్యన్ జర్నలిస్టులు చాలమంది నర్గీస్, రాజ్‌కపూర్ లతో కలసి ఫొటోలుతీయించుకున్నారు. వీరిద్దరూ రష్యాలో అందరికీ అభిమాననటులు. బొంబాయిలో భారత రష్యాసాంస్కృతిక సంఘం అధ్వర్యాన మరో విందు జరిగింది. కృష్చేవ్ ఆ సందర్భంలో మాట్లాడుతూ ఇరు దేశాలమధ్య స్నేహ సంబంధాలు పెంపొందడానికి భారతీయ చిత్రాలవల్ల చాలాదోహదం జరిగిందన్నారు. భారత ప్రభుత్వం నిర్మించిన డాక్యుమెంటరీ



ప్రతిభా వారి "ఏది నిజం" లో రమణారెడ్డి, నాగభూషణం.

 

# బొంబాయి సినిమాలేఖ



చిత్రాలు 'డార్జిలింగ్', 'మాజిక్ ఆఫ్ ది మౌంటెన్స్', 'ట్రీ ఆఫ్ వెల్త్', 'టుమారో ఈజ్ అవర్స్', చూచి సోవియట్ నాయకులు ప్రశంసించారు.

బొంబాయి, సంస్కృతికీ, చలనచిత్ర కళకు, పరిశ్రమలకూ నిలయమని మరొకసందర్భంలో అభివర్ణించారు.

* * *

ఉత్తమ చిత్రాలకు ప్రభుత్వం ఇవ్వదలచిన బహుమతులకు అర్హమైన చిత్రాలను ఏరడానికి నియమించబడ్డ బొంబాయి సంఘం, 'మీర్జా గాలిబ్' చిత్రాన్ని సిఫార్సుచేసినట్లు తెలుస్తోంది. ఈ చిత్రంలో ఉర్దూ కవి గాలిబ్ భూమికను భరత్ భూషన్ నిర్వహించాడు. వివిధ ప్రాంతీయసంఘాలు నిర్ణయించే చిత్రాలన్నిటినీ, కేంద్రసంఘం చూచి తుదినిర్ణయాలు చేస్తుంది. ఈ నెలాఖరులోగానే, బహుమతిప్రదానోత్సవం జరుగుతుంది.

* * *

నృత్య, నాటక, సంగీత కళలతోపాటు, చలనచిత్ర కళను కూడా సత్కరించాలని సంగీత నాటక అకాడమీ నిశ్చయించి, ఇందుకై రెండు 'అకాడమీ బహుమతులు' ఏర్పాటు చేశారు. వీటిలో ఒకటి ఉత్తమ చిత్రనిర్మాతకు గాని, దర్శకుడికి గాని ఇస్తారు. రెండవది ఉత్తమ నటనకు ప్రత్యేకించారు. వచ్చే మార్చినాటికి నిర్ణయాలు చేసి బహుమతులు ప్రకటిస్తారు. ఫిలిం సంస్థలు, విమర్శకులు, అభిమానులూ అంతా బహుమానార్హమని తమకు తోచిన చిత్రాల పేర్లను సూచిస్తూ జనవరి 31 లోగా అకాడమీకి తెలియచేయాలి. లేఖలు అకాడమీ కార్యదర్శి పేరిట, నెం 70, రీగల్ బిల్డింగ్స్, న్యూఢిల్లీకి వ్రాయాలి.

* * *

సుప్రసిద్ధ దర్శకుడు ఆల్ఫ్రెడ్ హిచ్ కాక్ మొన్న బొంబయి వచ్చినపుడు సూర్యకుమారి ఇడ్లీలు దోసెలు మొదలైన వంటకాలతో ఆయనకు విందుచేసింది తరువాత కర్ణాటక సంగీతం లలిత సంగీతం పాడి వినిపించింది. శ్రుతికోసం ఉపయోగించిన తంబురా పట్ల హిచ్ కాక్ ఆసక్తి కనుబరచారు. సూర్యకుమారి ఆ వాద్యం గురించి ఆయనకు తెలియచెప్పింది. ఎ. జె. పటేల్ ఇంట్లో హిచ్ కాక్ గుజరాతీ వంటకాలు రుచి చూశారు.

* * *

ఫిలిం ఫెడరేషన్ అధ్యక్షుడు శ్రీవాసన్, ఐ. ఎం. పి. పి ఎ. అధ్యక్షుడు, శ్రీ పాటిల్, తదితర ఫిలిం ప్రముఖులు మొన్న సమావేశమై భారతీయ టాకీ రజతోత్సవాలను వచ్చే మార్చిలో జరుప నిశ్చయించారు. దిలీప్ కుమార్, రాజ్ కపూర్, బాల్ రాజ్, ఈ ఉత్సవ నిర్వహణలో పూర్తిగా సహకరిస్తామని నటుల తరఫున హామీ ఇచ్చారు.

* * *

వరదబాధితుల సహాయార్థం ప్రధాని పేరిట నెలకొల్పబడిన నిధికి, ఈ మధ్య వైజయంతిమాల నృత్యప్రదర్శనం ద్వారా ధనం వసూలు చేసి, విరాళం ఇచ్చింది. ప్రధాని శ్రీ నెహ్రూ తరువాత, ఆమెకు విందుచేశారు.

"బర్మా ప్రధాని శ్రీ థాకిన్ నూకు మీ నృత్యం అంటే చాలా అభిమానం. త్వరలోనే, బర్మానుంచి మీకు ఆహ్వానం వస్తుంది" అని ప్రధాని నెహ్రూ ఆ సందర్భంలో వైజయంతిమాలకు తెలియచేశారు.

హేమేన్ గుప్త నిర్మిస్తున్న "టక్ సాల్" చిత్రంలో అసితా మజుందార్, నిరూపరాయ్, బల్రాజ్ సాహ్నీ.

# సినిమా వార్తలు

నరసూవారు నిర్మిస్తున్న కిస్మత్, చిత్రం చాలాభాగం 'పూర్తిఅయింది. ఫిబ్రవరి మొదటివారంలో విడుదల కావచ్చునను కుంటున్నారు. బొంబాయి టాకీస్ వారి సుప్రసిద్ధ చిత్రం 'కిస్మత్' ఆధారంగా నిర్మిస్తున్న ఈ చిత్రానికి శ్రీ వేదాంతం రాఘవయ్య దర్శకుడు. నాగేశ్వరరావు, సావిత్రి, సి. ఎస్. ఆర్, రేలంగి, గౌరీనాథ శాస్త్రి, గుమ్మడి వెంకటేశ్వరరావు, పేకేటి హేమలత, గిరిజ, సీత, చెల్లం మొదలగు వారు నటిస్తున్నారు. సంగీత దర్శకుడు రాజేశ్వరరావు. కవి. సదాశివబ్రహ్మం.

* * *

విక్రమ్ ప్రొడక్షన్స్‌వారి తెనాలి రామకృష్ణ ఈనెల 29 న విడుదల అవుతుంది. నాగేశ్వర రావు, ఎన్. టి. రామారావు, రేలంగి, ముక్కామల కృష్ణమూర్తి, భానుమతి, జమున మొదలగువారు నటిస్తున్న ఈచిత్రానికి శ్రీ బి. ఎస్. రంగా దర్శకుడు.

* * *

ప్రమోదఅండ్ శ్రీ ఫిలింస్‌వారి చిత్రం "పసుపు కుంకుమ" డిసెంబరు 15 న విడుదల అవుతోంది. జగ్గయ్య, జి. వరలక్ష్మి నటించిన ఈ చిత్రానికి శ్రీ జి. డి. జోషి దర్శకుడు.

* * *

శ్రీ సి. పి. దీక్షిత్ దర్శకత్వాన జూపిటర్ పిక్చర్స్ నిర్మించిన 'సంతోషం' ఈ నెల 24 వ తేదీన విడుదల అవుతుంది అంజలి, రామారావు, జమున, జగ్గయ్య, రేలంగి, చదలవాడ నటించారు.

* * *

సంక్రాంతికి సాధ్యపడకపోయినా, జనవరి నెలాఖరుకు విడుదల చెయ్యాలన్న సంకల్పంతో,దర్శకుడు శ్రీ ఎస్.రజనీకాంత్, కనకతార నిర్మాణం చురుకుగాసాగిస్తున్నారు. ఇప్పటికి మూడింట రెండువంతులు పూర్తిఅయింది. శ్రీ రజనీ కాంత్ కు ఇది రెండవ చిత్రం. (ఆయన దర్శకత్వం వహించిన మొదటి చిత్రం వదినగారి గాజులు) గోకుల్ పిక్చర్ వారు నిర్మిస్తున్న ఈచిత్రంలో ఎస్. వరలక్ష్మి, ఎస్. వి. రంగారావు, చదలవాడ కుటుంబరావు, వర్మ మొదలగు వారు నటిస్తున్నారు. కవి: జంపన. సంగీత దర్శకుడు ఘంటసాల.

* * *

ప్రతిభా చిత్రం 'ఏది నిజం' ఇండోర్ షూటింగ్ దాదాపు పూర్తి కావచ్చింది. శ్రీ బాలచందర్ దర్శకత్వాన తయారవుతున్న ఈ చిత్రం ఫిబ్రవరిలో విడుదల కావచ్చు.

* * *

మోడర్న్ థియేటర్స్‌వారి గేవాకలర్ చిత్రం 'ఆలీబాబా నలభైమంది దొంగలు' సంక్రాంతికి విడుదల కాబోతున్నది. దీన్ని వీరు తమిళంలో కూడా నిర్మించారు. తమిళ నటుడు ఎం. జి. రామచంద్రన్, భానుమతి ఇందులో ప్రధాన భూమికలు నిర్వహించారు. దర్శకుడు టి. ఆర్. సుందరం మాటలు ఆరుద్ర. పాటలుకొన్ని కీ శే. తోలేటి వెంకటరెడ్డి వ్రాశారు. మిగతావి ఆరుద్ర వ్రాశారు. సంగీతం దక్షిణామూర్తి.

* * *

రిపబ్లిక్ ప్రొడక్షన్స్ వారు 'బడిపంతులు' అనేచిత్రం నిర్మించ నిశ్చయించారు. దర్శకత్వం, ఛాయాగ్రహణం కూడా శ్రీ బి. యస్. రంగా నిర్వహిస్తారు. కవి'ఆత్రేయ' సంగీత దర్శకులు విశ్వనాథం, రామమూర్తి. నాగయ్య, సి. ఎస్. ఆర్. అమర్‌నాథ్, చలం, గుమ్మడి, డా॥ శివరామకృష్ణయ్య, రాజసులోచనలను ఇప్పటికి బుక్ చేశారు. నిర్మాణం జనవరి 26 రిపబ్లిక్ దినోత్సవాల వేళ ప్రారంభించాలని నిర్మాతల సంకల్పం.

## నాంపెన్‌లో చలన చిత్ర ప్రదర్శనం

### భారత చిత్రానికి ప్రథమ బహుమతి

కాంబోడియా రాజధాని నాంపెన్‌లో ఇటీవల జరిగిన అంతర్జాతీయ చలనచిత్రోత్సవంలో భారతీయచిత్రం 'దోబిఘా జమీన్'కు, జపాన్ చిత్రం 'గేట్స్ ఆఫ్ హెల్'కు ప్రథమ బహుమతి లభించింది. ద్వితీయ బహుమతి, మనదేశం పంపిన మరో చిత్రం బూట్‌పాలిష్‌కు లభించింది. డాక్యుమెంటరీ చిత్రాలలో భారతదేశపు చిత్రం. 'సింఫనీ ఆఫ్ లైఫ్'కు బహుమతి లభించింది.

ఈప్రదర్శనంలో ఆసియా దేశాలు అరు పాల్గొన్నాయి.

* * *

గత సంవత్సరం తయారైన చిత్రాలలో ఉత్తమమైన వాటికి ఈ నెల 21 న రాష్ట్రపతి డా॥ రాజేంద్రప్రసాద్ బహుమతులు ఇస్తారు. ఈ ఉత్తమ చిత్రాలు నిర్ణయించిన కేంద్రసంఘానికి బీహార్ గవర్నర్ శ్రీ ఆర్. ఆర్. దివాకర్ అధ్యక్షులు.

## స్వర్గీయ అరుణ్‌కుమార్

సుప్రసిద్ధ సంగీత దర్శకుడు అరుణ్ కుమార్ ఈ నెల 5 వ తేదీన, హృద్రోగం వల్ల హఠాత్తుగా మరణించారు. 1937 ప్రాంతాలలో ప్లేబాక్ గాయకుడుగా చలన చిత్రరంగంలో ప్రవేశించి మధుర గాయకుడుగా పేరొందాడు. బొంబాయి టాకీస్ చిత్రాలలో అరుణ్ కుమార్ గాయకుడుగానే కాక, నటుడుగా కూడా మన్నన లందుకున్నాడు. ఈయన సంగీతం సమకూర్చిన ఇటీవలి చిత్రాలలో పరిణీత ఒకటి. తీన్ భాయ్ అనే మరొక చిత్రం ఇంకా విడుదల కాలేదు.

అశోక్ కుమార్‌కు ఈయన దగ్గర బంధువు.

## ఝనక్ ఝనక్ పాయల్ బాజే

శాంతారాం టెక్నికలర్ చిత్రం 'ఝనక్ ఝనక్ పాయల్ బాజే'ని త్వరలోనే విదేశాలలో ప్రదర్శించడానికి యేర్పాట్లు జరుగవచ్చు. చాలామంది విదేశీ డిస్ట్రిబ్యూటర్లు ఈ చిత్రం తీసుకువెళ్లాలని మోజపడుతున్నారు. రాజ్‌కమల్ కళామందిర్‌తో ఈ విషయమై సంప్రతింపులు జరుపుతున్నారు. సింహళంలో విడుదలకు అప్పుడే ఒకసంస్థ శాంతారాంతో ఒప్పందం వ్రాసుకుంది. ఈ చిత్రాన్ని ఫ్రాన్సులో ప్రదర్శించడానికి సన్నాహాలు జరుగుతున్నాయి. వచ్చేసంవత్సరారంభంలో విడుదలకావచ్చు.

ఇది ఇలావుండగా, భారత ప్రభుత్వం మూడుకాపీలు (16 మిల్లిమీటర్లవి) కొనాలనుకుంటున్నారు. శాంతారాంతో కేంద్ర విదేశాంగశాఖవిషయమై చర్చ జరుపుతున్నారు. విదేశాలలో భారతరాయబారి కార్యాలయాలద్వారా అక్కడి పెద్దలకు ఈ చిత్రాన్ని చూపించాలని ప్రభుత్వం సంకల్పం.

## 'మాయా మచ్ఛీంద్ర' కన్నడంలో డబ్బింగ్

1946 లో ఫేమస్ సినీ అండ్ స్టార్ కంబైన్స్ నిర్మించిన 'మాయా మచ్ఛీంద్ర' తెలుగుచిత్రం కన్నడంలో డబ్ చేయబడింది. కన్నాంబ, గౌరీనాథశాస్త్రి, ముక్కామల కృష్ణమూర్తి నటించిన ఈ చిత్రంలో, సుమారు ఆరువేల అడుగులమాత్రం కొత్తగా తీసి, అందులో హాస్యం చొప్పించారు. డిసెంబరు నెలలో ఇది విడుదలకాగలదు.






## ఆరో అధ్యాయం

సుశీల వెళ్ళిన నాలుగు రోజులకు అంతా ఖులాసాగానే చేరారన్న ఒకముక్క ఉన్న మూడుకాసుల కార్డుమాత్రం వచ్చింది రామమూర్తి దగ్గర నుంచి అంతే మళ్ళీ నెలరోజులపైన అయింది కాని ఏ ఉత్తరమూ రాలేదు. ఉత్తరం రాకపోయినందుకు రఘు పెద్దగా చింతించలేదు. కాని పిల్లలెలా ఉన్నారో అన్న ఆదుర్దామాత్రం అతనిని పీడిస్తూ ఉంటోంది ఆ ఆదుర్దాతో ఉత్తరం వ్రాసేటంతవరకూ వెళ్ళాడు కాని వ్రాయలేదు. తను వ్రాస్తే అవతలవాళ్ళకు లోకువై పోడూ? తనను లొంగదీయాలనే అవతలవాళ్ళు తన సుశీలనీ, పిల్లలనూ తీసుకు వెళ్ళారు. సుశీల తనమాట కాదని వెళ్ళింది. ఎన్నాళ్ళని తనకు దూరంగా ఉంటుందో చూడాలి. ఈ పట్టుదలతో రఘు ఉత్తరం వ్రాయలేదు. నెలరోజుల నుంచీ ఒంటరిగానే కాలక్షేపం చేస్తున్నాడు హోటలు భోజనం ఆఫీసు, కృష్ణవొడ్డూ తప్పితే లైబ్రరియే అతని వాసస్థానాలు. నిద్రకు మాత్రం ఇంటికి చేరుకొంటున్నాడు ఒక్క సీతారామయ్యగారితో తప్ప మరెవరితోనూ మాట్లాడడం లేదు. ఇప్పుడు తనకు పూర్తిగా ఇంటిగొడవ తప్పిపోయింది కాబట్టి కవిత్వ రచనకు ఎక్కువ సమయం వినియోగించవచ్చు ననుకున్నాడు కాని ఎంతప్రయత్నం చేసినా కాగితంమీద కలం నడవలేదు. పట్టుదలతో పదిపంక్తులు వ్రాసినా అవి పదిసార్లు కొట్టివేసి తిరగవ్రాసి చివరికి కాగితం చింపి పారవేస్తున్నాడు. ప్రవాహమే లేకపోతోంది ఇప్పుడు రచనలో. భావాలేవో మనస్సులో గజిబిజిగా ఉంటున్నాయి వాటిని మాటల్లో వ్యక్తీకరిద్దామంటే మాటలు లొంగడంలేదు. విప్లవం, సంఘర్షణ, ఉష్ణరక్తం మొదలయిన మాటలు తలచినా వాటి వెనకాల ఉడుకు బయలుదేరడం లేదు కమలతో తిరిగి మాట్లాడితే జడత్వం పోతుందేమో. కాని కమలను కలుసుకోవడమెలా? నెలరోజుల పైనుంచీ కమల తనకేసి చూడలేదు ఒకవేళ ఇద్దరూ దగ్గరకు రావడం తటస్థిస్తే ఆమె మొగం ఇంకొకప్రక్క తిప్పుకొని వెళ్ళిపోతోంది. పాపం, ఆనాడు తన ఇంటివద్ద జరిగిన అవమానానికి ఎంతగా బాధపడిందో. తమ ప్రవర్తనలో దురుద్దేశమేమీ లేకపోయినా తాము దూరంగా ఉండవలసి వస్తోంది—సంఘానికి వెరచి. లేనిది అనుమానించింది సంఘం. అటువంటి సంఘంపట్ల తానెందుకు గౌరవం చూపాలి? తనబాగు అక్కర్లేని సంఘం బాగు తనకు మాత్రం ఎందుకు కావాలి? సంఘానికి బుద్ధి చెప్పాలంటే సంఘం అనుమానించినది ధృవపరచడమే. సంఘాన్ని 'ధిక్కరించాలనే తలపతనికి అనేకమార్లు రాసాగింది. కమలకుకూడా ఇదేవిధమైన ఆలోచనలు వస్తున్నాయేమో! తనలాగే బాధపడుతోందేమో. ఆఫీసులో ఉన్నప్పుడు కమలకేసి చూడసాగాడు, కాని కమల అతనికేసి చూడడం లేదు.

ఈవిధంగా చూడడంతో అతనిదృష్టి అనుకోకుండానే అనేక పర్యాయాలు ఆమె శరీరంమీద ఆగజొచ్చింది. ఒక్కొక్కప్పుడు స్వయంగా గ్రహించి రఘుయే ఆశ్చర్యపోతున్నాడు. దృష్టిని మరలించుకోవడానికి ప్రయత్నం చేస్తున్నాడు కాని ఆమె ప్రతికదలికా, 'శరీరపు ప్రతివంపూ అతని కళ్ళల్లో చెరపరానివిధంగా ముద్రింపబడుతున్నాయి. 'కమల సౌందర్యవతి అనే విషయం పదే పదే స్ఫురణకు రాజొచ్చింది కంటికి దూరమైన సుశీల సౌందర్యంకన్న కళ్ళముందున్న కమల అందమే అధికమనిపిస్తోంది. వివేకం తలెత్తినప్పుడల్లా "ఛ ఛ. ఏం పాడు ఆలోచనలు" అని మనస్సుకు కళ్ళెం బిగించి పట్టేవాడు. కాని స్వేచ్ఛ మరిగిన గుర్రం రౌతునుకూడా లాగుకుపోసాగింది కాదనుకున్నా కమలను గురించి కూడని ఆలోచనలన్నీ కలుగుతున్నాయి. తనలో ఏవో రెండుశక్తులు ఘర్షణపడుతున్నాయనిపిస్తోంది. ఒకటి నీతి, అవినీతి అనేది ఆలోచించదు. దానికి కావలసిందల్లా కామతృప్తి. కావలసినది లభించడమే. అది ఎలా లభించినా సరే. లభించాలి అంతే! కాని వెంటనే రెండోశక్తి అడ్డు వస్తోంది. "ఆగు, ఆగు నీ యిష్టం వచ్చినట్లు చేయడానికి వీలులేదు. ఇతర మానవులున్నారు వారూ నీలాగే ప్రవర్తిస్తే సంఘం ఏమవుతుంది? జాగ్రత్తగా ఉండు. అణిగి ఉండు. సంఘ కోపానికి గురికాకు" అంటోంది ధర్మప్రవక్తలా. తనలోనే రెండు విరుద్ధశక్తులెలా ఉంటున్నాయి? తన మనస్సే రెండు భాగాలుగా విడిపోయిందా? తనలోనే రెండు వ్యక్తిత్వాలు ఇమిడిఉన్నాయా? తన అసలు వ్యక్తిత్వమేమిటి? ఈ అంతరంగిక సంఘర్షణ అతనిని పీల్చి పిప్పిచేసి వేస్తోంది.

కాని తన మనస్సులోనేనా ఈ సంఘర్షణ? ఇంకెవరికీ ఉండదూ? తనకేనా అందమైన యువతిని చూస్తే ఇటువంటి ఆలోచనలు కలిగేది? మరెవరికీ కలగవా? ఏమో

మంగా తలపోయకూడదు. తను తన సుశీ అనే తలచుకోవాలి. కమలకు దూరంగా ఉండాలి అని నిశ్చయానికి వచ్చాడు రఘు. దూరంగానే ఉండిపోతున్నాడు. కమల వైపు చూడడమే మానివేశాడు. సుశీలమీదకే పోనీయసాగాడు తన ఆలోచనలు. క్రమంగా సుశీలరూపమే స్పష్టం కాజొచ్చింది మనఃఫలకంమీద. సుశీల అమాయికపు చూపులూ, ఆ సిగ్గుచేష్టలూ, ఆమె సుందర వదనం, జాలి కబుర్లు అన్నీ స్మరించుకున్నాడు. సుశీలపట్ల అభిమానం పొంగిరాసాగింది. కోపం తగ్గిపోయింది. పాపం వెర్రి సుశీని మెల్లగా దారిలో పెట్టాలి అన్న భావం కలుగజొచ్చిందతనికి. బ్రతికిపోయాననుకున్నాడు రఘు. ప్రమాదం నుంచి బయటపడ్డాననుకున్నాడు. దుష్టశక్తులను గెలిచివేశాననుకున్నాడు. కాని ఆ గెలుపులో పూర్తిధైర్యం లేదు. ఎప్పుడు తిరుగుబాటు చేస్తాయో ఆ పాశవిక శక్తులు. వాటి కంఠబలం ఎక్కడనుంచి వస్తుందో ఆశ్చర్యం కలిగిస్తుంది. వాటికి అవకాశంలభించకుండా చూసుకోవాలి. నిరంతరం జాగరూకత వహించాలి. ఈ జాగరూకతే తనరక్ష అని తనను తాను ఎంతో కట్టుబాటులో పెట్టుకున్నాడు రఘు. ఈ సంఘర్షణసమయంలో నీతి నియమాలమీద బయలుదేరిన జిజ్ఞాస వేదాంతంవైపు సాగింది. వేదాంత పుస్తకాలు చదవాలన్న కుతూహలం బయలుదేరింది. ఆంగ్లంలోవీ, ఆంధ్రంలోవీ తత్త్వశాస్త్ర గ్రంథాలు తెచ్చి చదువుతున్నాడు. ఇదివరకు తత్త్వశాస్త్రమంటే హేళనగా చూసేవాడు. పనిలేనివాళ్లపిచ్చి ఆలోచనలనుకునేవాడు. ఇప్పుడీ పుస్తకాలు చదవడం మొదలుపెట్టిన తరువాత ఈ తత్త్వవిచారంలో కూడా ఆసక్తిజనకమైనది చాలా వుంటుందని తెలిసింది. అందుకే అయివుంటుంది అనాదిగా ఎందరెందరో మహామహుల నింతగా ఆకర్షించగలిగిం దీశాస్త్రం. తత్త్వ విచారానికి చెల్లెలయిన తర్కశాస్త్రంకూడా అధ్యయనం చేశాడు రఘు. స్వయంగా తత్త్వవిచారం కూడా చేయసాగాడు. ఈ ప్రపంచమేమిటి, దృగ్గోచరమైనదల్లా సత్యమేనా, మనస్సేమిటి, ఇది ఎలా ఏర్పడింది, మనస్సుకూ పదార్థానికి సంబంధమేమిటి, అసలు బాహ్యజగత్తు అనేది ఉందా, అంతా మాయేనా, అసలు తానెవరు, తన కాత్మ అనేది ఉందా, ఉంటే ఎక్కడనుంచి వచ్చింది, ఎక్కడకు పోతుంది మొదలైన అంతులేని అగాధ విషయాల్లో పడిపోయి కొట్టుకుంటున్నాడు. తీవ్ర తర్కం చేసుకుంటున్నాడు. ఈ తర్కపు వేడిగాడ్పులకు సుకుమార కవితా వృక్షం వాడిపోయి ఎండిపోయింది. కవి వేదాంతి అయిపోయాడు.

కాని వేదాంతికూడా సిసలైన వేదాంతి కాడని త్వరలోనే తేలిపోయింది. ఎప్పటిలాగే ఆ వేళ కూడా రఘు కృష్ణ ఒడ్డుకు పోయాడు. వాతావరణం అంతా బాగా ఉంది. చల్లనిగాలి వీస్తోంది. నదిలో ఎవరో కొందరు ఈదుతున్నారు. దూరాన చాకళ్ళ విసుపులేని పాట వినిపిస్తోంది. సూర్యకాంతిలో బంగారు శకటాలుగా మారిపోయి ధగధగా మెరుస్తూ తేలిపోతున్న చిన్న మేఘాలూ, నీడ లెగబాకుతున్న నిస్తబ్ధ గిరులూ, క్రింద జలజలా ప్రవహించిపోయే కృష్ణమ్మ. ఎంత చక్కని దృశ్యం! అదే దృశ్యం చూసి ఇదివరకు అతడు ఆనందంలో మునిగిపోయేవాడు. గుండె కమ్మని కోరికలతో, తీయని బాధలతో నిండిపోయేది. కవిత వెల్లువై బయలువెడలేది. కాని ఇప్పుడా రఘు వేదాంతి. కొత్తదనం పోని వేదాంతి. ప్రతి వస్తువూ ప్రతి విషయమూ తత్త్వ విచారాన్ని లేపే కొత్తదనమది. ఇదివరకు కవితకు కారణమైన దృశ్యమే ఇప్పుడు కొత్త భావాలను కలుగజేస్తోంది. ఈ కొండా, ఈ నదీ, ఈ ఆకాశం, ఈ మేఘాలు ఇవి అన్నీ ఏమిటి? ఇవి అన్నీ ఒక సుందర దృశ్యంగా కనిపిస్తున్నాయి కాని ఈ సౌందర్యమేమిటి? సౌందర్యమా వస్తువులలో ఉందా, తనలో ఉందా. ఆ కొండకీ, ఆ నదికీ, ఆకాశానికీ తాము ఒక సుందర దృశ్యం కలుగజేస్తున్నామని కాని, తమలో ఒక సౌందర్యముందని కాని తెలుసునా? అది అసంభావ్యం. పోనీ ఈ సుందర దృశ్యాన్ని చూసే ప్రతి జీవికీ ఇది సుందరదృశ్యంగా గోచరిస్తుందా. పర్వతం మీద పచ్చిక మేస్తున్న పశువులకీ సౌందర్యం తెలుస్తుందా. వియత్ పథంలో విహరించే విహంగాలకీ సౌందర్యం బోధపడుతుందా. అదీ అసంభావ్యమే. ఈ సౌందర్యం మానవుడికే తెలుస్తుంది. అంటే సౌందర్యమనేది మానవ మనో జనితమే. గ్రుడ్డివాడికి సౌందర్యమే లేదు. తన కందంగా కనిపించేదానిని ఇంకొక డలక్ష్యం చేయవచ్చు. ఒకడికి తోచిన సౌందర్యం ఇంకొకడికి కనిపించకనే పోవచ్చు. ఒకడిని పారవశ్యంలో పడవేసిన సంగీతం ఇంకొకడికి కర్ణకఠోరంగా ఉండవచ్చు. ఒకడిని నోరూరించే వస్తువు ఇంకొకడికి వికారం కలిగించవచ్చు. రుచి, సౌందర్యం, మాధుర్యం మొదలైన భావాలన్నీ కూడా మానవుని మనసులోనివే. మానవుడే వస్తువులలో సౌందర్యం మొదలైనభావాలారోపిస్తాడు కాని నిజంగా మానవుని మనస్సును దాటి సౌందర్యం మొదలైన భావాలకస్తిత్వమే లేదు. మరి వస్తువులో? బాహ్య జగత్తుగా కనిపించే వస్తుసముదాయం కూడా మానవుని మనస్సుమీద ఆధారపడి ఉన్నదేనా. కావచ్చు. లేకపోతే భ్రమ అనేదేలా జనిస్తుంది. తాడు పాముగా ఎందుకు కనిపిస్తుంది? నీటిలో సంగం మునిగిన పుల్ల వంగినట్లు కనిపిస్తుంది. శూన్యమైన ఆకాశం నీలావరణంలా కనిపిస్తుంది. నీలంగా కనిపించే నదీజలం చేతిలోకి తీసుకుంటే నిర్మలంగా స్వచ్ఛంగా కనిపిస్తుంది. కారణమేమిటి? దీనికి కారణం వీటిని గూర్చిన జ్ఞానం మన ఇంద్రియాలపై ఆధారపడి ఉండడమే కదా. మనకు కొండ కొండగానే మనస్సు ముందుకు రాదు కదా, కొండయొక్క ప్రతిబింబమే మనస్సు ముందుకు వచ్చేది. ఆ ప్రతిబింబానికీ అసలు వస్తువుకీ సరియైన సంబంధమే ఉందని నిర్ధారించడమెలా? ప్రతిబింబమైనా కొన్ని సంకేతాలుగానే మనస్సు ముందుకువస్తుంది. మనస్సు ఆ సంకేతాలకు అర్థం కూర్చుకుంటుంది అందిన సమాచారాన్ని బట్టి భిన్నమైన అర్థం కూర్చుకోవడంకూడా సంభవిస్తూ ఉంటుంది. అదే భ్రమ. తాడు పాముగా కనిపించడం, నీళ్లలో

---

టెలిఫోన్ గణగణమంది. ఏడేళ్ళ కుర్రాడు తీసి 'హలో' అన్నాడు.

"మీ నాన్న ఉన్నారా?"

"లేరండి."

"అమ్మగారు?"

"లేరండి"

"మీ అక్క అన్న ఎవరూ లేరా ఇంట్లో?"

"నేను, మా బామ్మ, మా కుక్కపిల్ల ఉన్నామండి. బామ్మకి చెవుడు. కుక్కపిల్లకేమీ మాటలు రావు."

---







# లైఫ్ బాయ్ సబ్బు

ప్రతిదిన మలినములోని క్రిముల నుండి మిమ్ములను కాపాడును







ఇండియాలో తయారుచేయబడినది

L. 254-X52 TL

మునిగిన కర్ర వంగినట్లు కనబడటం. కాని మనస్సు వేరే ఆధారాలనుబట్టి భ్రమను తెలుసుకొని సరియైనజ్ఞానం పొందుతుంది. అంటే వస్తుజ్ఞానం మనస్సుమీద ఆధారపడి ఉంటుంది. మనస్సు లేకపోతే ఇంద్రియాలెంతపనిచేసినా ప్రయోజనం లేదు. బాహ్య జగత్తున్నా లేకపోయినా ఒకటే అవుతుంది. మరి పదార్థానికి పూర్తిగా భిన్నంగావుండే మనస్సుకు పదార్థజ్ఞానం ఎలా కలుగుతుంది? పదార్థంకూడా చివరికి మనోమయమే అయి ఉండాలి. లేకపోతే మన మనస్సుకు పదార్థానికీ సంబంధం కలగడానికి అవకాశమే లేదు. అణు సూక్ష్మంగా ఆలోచిస్తే ఘన పదార్థంకూడా ఘనపదార్థంగా ఉండదు. గాలి అయిపోతుంది ఎదురుగా జడంగా స్థిరంగా కనిపించే కొండకూడా పరమాణు నిర్మితమనీ, ఆ పరమాణువులంటే కొంత అవకాశంలో తిరిగే ప్రోటానులూ, న్యూట్రానుల చలనం మాత్రమేననీ, యీ ప్రోటానులూ, న్యూట్రానులూ శక్తిస్వరూపాలనీ తెలియవస్తుంది. సూదిమొన మీద శత సహస్రాంశంకూడా ఉండనిపరమాణువులో ప్రపంచాన్ని బ్రద్దలు చేయగల బ్రహ్మాండమైనశక్తి ఇమిడివుందంటే పదార్థం ఇకపదార్థంగా ఎలా మిగలగలదు? చివరికి జగత్తులో మిగిలేది ఒక శక్తిమాత్రమే అని తేలుతోంది. మనస్సుకూడా ఆ శక్తిలో అంతర్భాగమే అయివుండాలి, అందువల్లే మనస్సుకు బాహ్యజగత్తుజ్ఞానం కలుగుతోంది. బాహ్య జగత్తు అనబడేదానిలో ఇంద్రియ గోచరమయ్యేది నిజమైన స్వరూపంకాదనీ ఒకే అంతర్నిహితమైన శక్తియొక్క మాయా స్వరూపంమాత్రమేనని, అది అవిధంగా కనిపించడానికి మనస్సే కారణమని ఈవిధంగా తనమనస్సుకే ప్రాధాన్యమిచ్చుకుంటూ బాహ్యజగత్తు అస్తిత్వానికి తన మనస్సిచ్చే ప్రమాణంతప్ప మరొక ప్రత్యక్షప్రమాణం లేదనీ ఆలోచించుకుంటూ పోతున్నాడు రఘు. ఈతర్క ఫలితంగా రఘుకీజగత్తులో సత్యమైనవిగా నిలచినవి తన మనస్సులోని భావాలుమాత్రమే అయ్యాయి.

కాని తన అస్తిత్వాన్ని శంకించినందుకు బాహ్యజగత్తు కోపకలిగెమో అన్నట్లుగా తూర్పున ఆకాశంలో చిన్న నల్లనిమేఘం లేవసాగింది. తన భావజగత్తులోనే మునిగిపోయివున్న రఘు దానిని గమనించలేదు. చాకళ్ళు చూశారు. కంగారుగా బట్టలన్నీ ప్రోగుచేసుకొని మూటలుగాకట్టి పట్టుకుపోతున్నారు. నదిలో పోతున్న పడవల వాళ్లు త్వరగాపడవలనుఒడ్డుకుచేర్చి స్తంభాలకుకట్టి పోతున్నారు. క్షణంలో ఆ చిన్ని మేఘం కాలరూపం ధరించి ఆకాశాన్నంతా ఆవరించివేసింది. కారుచీకటి కమ్మివేసింది. పెనుగాలి వీచసాగింది. ఇసుకదుమారంలేచి కళ్లు మూసివేస్తోంది. వేదాంతి రఘు లేవకతప్పిందికాదు. పెనుగాలిని పిల్లవాయువుగా కాలమేఘాన్ని చిన్నిమేఘంగా ఊహించుకొని కూర్చోలేకపోయాడు. ఇసుకదుమారానికి లేచి తూలుతూ వొడ్డువైపుకు నడవసాగాడు. దారి కనబడటంలేదు. ఎలాగో వూరిలోకి ప్రవేశించాడు. రోడ్డుమీద ఏబండికిందేనా పడిపోతానేమోనని భయపడసాగాడు. (బండి కస్తిత్వం ఉందా? బండి మిథ్యకాదా?) మెల్లగా పేవుమెంటుమీదకు చేరుకున్నాడు. ఇక ఫరవాలేదనుకుంటూ ముందుకు నడవసాగాడు. ఈ గాలికి మేఘం చెదిరిపోతుందనుకున్నాడు. కాని మేఘం మరింత భీకరాకృతి దాల్చింది. చెట్లు మూల్గుతూ భయంకరంగా తల లూపుతూ కంపించిపోతున్నాయి. జనం ఇళ్లలోకో, కొట్లలోకో దూరుతున్నారు. వర్షం వచ్చేటట్లుంది. రఘు పరుగెత్తడం మొదలుపెట్టాడు. ఇంతలో వీధి దీపాలు కూడా ఆరిపోయాయి తాను ఎటుపోతున్నాడో కూడా తెలియడంలేదు రఘుకి. ఎదురువచ్చే జనంతో ఢీకొంటూ పోతున్నాడు. మెరపులు మెరుస్తున్నాయి. ఒకక్షణం వేయి విద్యుద్దీపాలు వెలిగినట్లై దారితెలిసి అంతలో అంధకారం అలముకుపోతోంది. ఫెళఫెళారావం చేస్తూ మేఘాలు యుద్ధసన్నద్ధమవుతున్నాయి. వర్షందిగడం మొదలుపెట్టింది. క్షణంలో నేకుంభవృష్టిగా మారిపోయింది. రఘు కంగారుగా పరుగెత్తి ఒక చెట్టుక్రిందకు చేరాడు మరొక వ్యక్తి కూడా ఆ చెట్టుక్రిందకే చేరినట్లనిపించింది రఘుకు. కాని చీకటి చూడనీయలేదు. వర్షం ధారాపాతంగా కురుస్తోంది. ఎక్కడో ఏవో కూలిపోతున్నట్లు అనిపించి గుండె దడదడలాడిపోతోంది వర్షంహోరు తప్ప మరొక శబ్దమే వినరావడంలేదు. మళ్ళీ కళ్లుమిరుమిట్లు గొలిపే మెరుపొకటి వచ్చింది. రఘు ప్రక్కకి తిరిగి రెండో వ్యక్తికేసి చూశాడు. ఎవరు? కమల! ఉలిక్కిపడ్డాడు రఘు.

"ఏమండీ మొన్న మీరు ఎరువు తీసుకున్న గొడుగు ఇస్తారా?"

"అయ్యో. అర్జంటుగా కావాలా? నిన్ననే మా పొరుగింటాయనకి ఎరువిచ్చానే."

"అబ్బే, నాకేం అర్జంటు లేదండీ. ఆ గొడుగు మా ఎదురింటాయనిది. ఆయన కావాలంటున్నాడు."

కమలా చూసింది. వెంటనే చీకటి. ధనధనామంటూ ఉరుముతో భూమి బ్రద్దలైనట్లుంది. ఎక్కడో పిడుగు పడిఉండాలి. రఘుకు గుండె అదరిపోయింది. కమల ఎలా ఉందో పాపం. కమలాదేవీ అని గట్టిగా అరిచాడు. కమలకు వినబడిఉండదు. అయినా కమల అతనికి కొద్దిగా దగ్గరగా జరిగింది. రఘు కూడా దగ్గరకు జరిగాడు. ప్రకృతిప్రతాపం ముందు అల్పజీవులొకరి ఆసరా ఒకరు కోరుకోవలసివచ్చింది. రఘు పూర్తిగా తడిసిపోయాడు. చెట్టేమీ ఆశ్రయమీయడంలేదు. దానికే ప్రాణాపాయం వచ్చిపడినప్పుడు అది మరొకరి క్షేమాశ్రయమీయగలదు? మళ్లీ మెరుపు. వెలుతురుల్లో చూశాడు రఘు. కమల కూడా పూర్తిగా తడిసిపోయింది. చెట్టు ఊగిసలాడుతోంది. అక్కడ ఉండడమే ప్రమాదమనిపిస్తోంది. మళ్ళీ ఉరుము. ఉరుము శబ్దం ఆగిపోగానే రఘు గట్టిగా అరిచాడు వర్షంహోరుపైన కమలకు వినిపించేటట్లుగా: "కమలాదేవీ, మన మెలాగైనా తడిసిపోతున్నాం. ఇక్కడ ఈ చెట్టుక్రింద ప్రమాదంగా ఉంది. ఎప్పటికి కాగుతుందో వర్షం. మనం ముందు నడిస్తేనే మంచిదేమో, మిమ్మల్ని మీ యింటిదగ్గర దిగబెట్టాను వస్తారా" అని కమలకా కేక వినిపించి ఉంటుంది. మరుక్షణం మెరుపు వెలుతురులో ముందు కడుగు వేశాడు రఘు కమల కూడా ముందు కడుగువేసింది గుండెలవియజేసే ఫెళాఫెళారావం వర్షం మనిషిని వెనక్కి పడవేసేటంత జోరుగా ఉంది. రఘు కమలవైపు చేయి చాచాడు. కమల చేయి అందుకుంది. ఒకరి ఆసరా ఒకరు తీసుకొని ముందుకు నడిచారిద్దరూ. కమల చేయి వదలివేసి నడుస్తోంది. మెరుపు వెలు

తుకులో దాగి చూస్తుంటున్నారు. ఉరుము చప్పుళ్ళు కాగిపోతున్నారు. ఇప్పుడు రఘు మనస్సులోనే ఒకమూల చిన్న మేఘం లేస్తోంది. రఘు అది గమనించనే లేదు. కాని అది క్షణంలో మనస్సంతా ఆవరించివేసింది. మెరుపు వెలుతురులో కమలను చూశాడు. కమల పూర్తిగా తడిసిపోయింది. బట్టలామె ఒంటికి అంటుకుపోయాయి. ఆమె ఆకారంలోని ప్రతి వంపూ స్పష్టంగా కనిపిస్తోంది. మళ్ళీ వెంటనే చీకటిలో అంతర్ధానమైపోతోంది. కమల ఎంత అందంగా ఉంది అనుకున్నాడు రఘు ఒక క్షణం. లోని పాశవికశక్తులు ఆ క్షణిక విజయానికే గంతులువేశాయి. కాని వేదాంతి వెంటనే లేచాడు. ఈ సౌందర్యమేమిటి? ఉత్తి కల్పన. వెలుతురులో ఉన్నట్లనిపిస్తుంది. చీకటిలో మాయమైపోతుంది. ఇదీ కేవలం మనస్సు సృష్టించుకున్న ఒక భ్రమ అన్నారు. కాని తనప్రక్క సజీవమైన సౌందర్యం, పొంగే వెచ్చని రక్తంతో నిండిన శరీరం ఉందని - రఘు మనస్సు కాదన్నా, అతని శరీరం మాత్రం తెలుసుకుంటోంది. కమల సౌందర్యం ముమ్మాటికీ నిజమనిపించింది. చీకటిలో కూడా కళ్ళముందాడుతోందా సౌందర్యం. రఘు మనస్సులో తుఫాను పూర్తిగా విజృంభించింది. పాశవిక శక్తులు భయంకర నృత్యం చేస్తున్నాయి. మరల ఒక మెరుపు, మెరుపు వెంటనే ఉరుము. రఘు పాదాల క్రింద భూమి తల్లడిల్లిపోతోంది ప్రకృతి ప్రతాపం ముందు. రఘు మళ్ళీ చేయిచాపాడు. కమల అందుకుంది రఘు మనస్సులోని శక్తులు ఆకలితో అరిచాయి. ఉరుము తగ్గగానే చేయి వదలివేసింది కమల. మరికొంతసేపటికి మరొక మెరుపు. కమల ఇల్లు నలభై గజాలలో కనిపించింది. కమల హృదయం తేరపినబడింది. ముడుచుకుపోయిన మొగ్గ విప్పారింది. కాని రఘు మనస్సులోని పాశవికశక్తుల కది తీవ్రమైన ఆశాభంగం. ఆశయం అందుకోబోతూండగా అటంకం. రోషంతో, బాధతో ఘోషించాయి. రఘు ఒక్కసారిగా కమలను పట్టుకున్నాడు. కమల కొయ్యబారిపోయింది. రఘుగారూ అని కేక వేసింది. కాని రఘుకు లోనిశక్తుల ఆకలి కేకలు తప్ప మరొకటి వినిపించడం లేదు. అంత వర్షంలో కూడా అతనిలోని వేడి ప్రజ్వలిస్తోంది. అతని వేడి ఊర్పుల కామె మొగంమీద జారుతున్న నీరు కూడా ఆవిరైపోతోంది. కమల ఉక్కిరి బిక్కిరి అయిపోతోంది. "ఏమిటిది, రఘుగారు, ఆగండి" అని కేక వేసింది మళ్ళీ. కాని రఘు 'శరీరం సత్యం తక్కినదల్లా అసత్యం' మనేటంత ఉద్రేకంలో ఆమె శరీరాన్ని తన శరీరంలోనికి కలిపివేయాలనుకున్నంత గాఢంగా నొక్కివేస్తున్నాడామెను. నలిగిపోతోంది కమల. ఇంత ప్రపంచంలో ఇద్దరు అల్పజీవులు చేసే చిన్న పనికూడా లోకానికి బట్టబయలు చేసివేయాలనే చిలిపితనంతో అన్నట్లుగా పెద్ద మెరుపు మెరిసింది. వీధిలో ఇద్దరే ప్రాణులు. ఒకరి బంధంలో ఒకరు. వెంటనే చీకటి కమల మళ్ళీ కసవేసింది "వదలండి, ఏమిటీ పని" అని. కాని రఘు వినిపించుకోవడం లేదు. బయట వర్షం జోరు. లోన శక్తులజోరు. కమల అతని జుట్టు పట్టుకొని గుంజింది. కాని రఘు చేతులు వదలలేదు. కమల శక్తికొలది అతని మొగంమీద మొత్తివేయసాగింది. నాలుగుసార్లు మొత్తింది. ఐదుసార్లు మొత్తింది. ఆరోసారి రఘుకు స్పర్శజ్ఞానం కలిగింది. ఆగిపోయాడు. కమల మళ్ళీ మొత్తింది. రఘు వదిలివేశాడు. కమల దూరంగా ఉరికి "ఛీ, ఛీ, ఇదేనా మీ స్వభావం? ఇన్నాళ్ళూ స్నేహం చేసింది ఇందుకా. ఒక బలహీన క్షణంలో బలప్రయోగం చేయడానికా?" అంది. రఘు వణికిపోతూ తల వంచుకొని నిలబడ్డాడు. కమల "ఛీ, అందరూ ఒకటే, క్రూర మృగాలు! మళ్లీ మీ మొగం నాకెన్నడూ చూపకండి" అని ఒక్క పరుగుతీసి ఇంటిలో పడి తలుపు వేసేసింది. తలుపు వేసింది కాని గడగడలాడిపోయింది. రఘు పోయాడో లేదో! కొంతసేపు అలాగే నిలబడింది. తరువాత మెల్లగా లోపలికి పోయి తడివస్త్రాలు విడిచివేసి, ఒళ్లు తుడుచుకొని పొడివస్త్రాలు వేసుకొని తల తుడుచుకొని ఆరబెట్టుకోసాగింది. కిటికీలోనుంచి చూసింది. ప్రకృతి శక్తుల ప్రతాప మణిగినట్లుంది. గాలిహోరు తగ్గింది. వర్షంజోరూ తగ్గింది. మధ్య మధ్య మెరుపులు వస్తున్నాయి. ఉరుములు ఉరుముతున్నాయి. రఘు లేడక్కడ!

[ఇంకా ఉంది]

"ఏం సాగన్నా బస్తీ వచ్చావు? ఏం గిరాకీ?"
"ఏం లేదు బాబయ్యా. వింతలూ విశేషాలూ చూద్దామని బయల్దేరా. లాగానే తమ దర్శనం చేసుకున్నా."

క్రొత్త పరిచయమున్న ఇద్దరు ఆసాములు బస్సులో వెళ్తున్నారు.

ఒకరు: వచ్చేదే మాచవరం కదండీ?

రెం: అబ్బే ఇవాళ శనివారమండీ.

ఒకరు: మరే పనుందండీ.

#  కట్నాలనిషేధానికి చట్టం 

కాగితంమీద వ్రాయమంటారు. మిగతా దాన్ని ఏదో లోపాయికారీగా ఇవ్వమంటారు. రాబడిపన్ను శాఖ వారు ఈ డబ్బుకి బ్లాక్ మనీ అని పేరు పెట్టారు. రేపు వరకట్నాల నిషేధం బిల్లు చట్టం అయితే, 'బహిరంగ - బహుమానం,' లోపాయికారీ కట్నం విడివిడిగా ఇచ్చుకోవలసిన స్థితి ఏర్పడుతుంది.

కట్నాలని చట్టరీత్యా నిషేధిస్తే మార్కెట్‌లో వరుల బ్లాక్ మార్కెట్ రేటు, తారాజువ్వల్లె తారాపథాన్నందుకుంటుందని ఒక మంత్రి హెచ్చరించారు కూడా.

ఆనాడు ఆడపిల్లలు గలవారి కష్టాలు అడగనక్కరలేదు.

అసలు అయ్యదేవర కాళేశ్వరరావుగారికి పిల్లలులేరు కాబట్టి, పిల్లనిచ్చుకోవలసిన తలిదండ్రుల కడగండ్లు ఆయనకి తెలియలేదు. అందుకే ఆయన ఈ చట్టం సాగించుకు రావడానికి కంకణము కట్టుకున్నారు అని, ఆడపిల్లలు గల ఒక తండ్రి అన్నాడు.

పూర్వం పిల్ల నమ్ముకునేవారు. ఇప్పుడో, పిల్లని ఒక అబ్బికి కట్టిపెట్టిన తరువాత ఆ చిన్నదానికి, అన్నవస్త్రాలు, పువ్వులూ పళ్లూ కొని పెట్టడానికి అడ్వాన్సుగా డబ్బు పుచ్చుకుంటున్నారు. డబ్బుకి అన్నము అమ్మే హోటలు యజమానులకు ఏవిధంగానూ తీసిపోని ఆసాములంతా ఈనాడు కన్యాశుల్కం నాటకం చదివి, కడుపుబ్బ నవ్వుతారు. ఆడపిల్లని అమ్ముకోబోయిన అగ్నిహోత్రావధానుల్ని ఈసడించుకుంటారు ... నిజంగా ఆ నాటకం చదివి నవ్వడానికీ అందులో పాత్రలను చూచి ఈసడించుకోడానికీ జాలిపడడానికీ హక్కు ఎంతమందికి ఉంది?...

'అబ్బాయిగారి చదువుకి ఆస్తిలో సగము ఖర్చయింది' అని సమర్థించుకుంటారు కొందరు. అబ్బాయి పెద్దచదువు చదివి పెద్ద ఉద్యోగంచేస్తే, తమని ముందు ఉద్ధరిస్తాడన్న ఆశతో పెట్టినఖర్చంతా పిల్లనిచ్చుకునే వియ్యంకుడి నెత్తిన రుద్దడము ఈనాటి సంస్కృతి. సబబు. ఫ్యాషన్.

కొందరు ఒకఛాయలో జీవనం సాగిస్తూ ఉంటారు. పైవాళ్ళతో తూగలేరు. క్రింది వాళ్ళతో కలవలేరు. ఈ తరహావారు, నిష్ప హోయతను అంగీకరించలేక, తలతాకట్టు పెట్టుకుని అయినా, పైవారు పెట్టే షరతులన్నీ పాటించి పిల్లకు పెళ్లి చేస్తారు. బోటాబోటిగా తెచ్చినడబ్బుతో పెళ్లిన పెళ్లి చేసినా, దరిమిలా వియ్యాలవారి ధాటికి తట్టుకోలేరు. తూగలేరు. వారు చిన్నపుచ్చటమో, వీరు చిన్నపుచ్చుకోవడమో జరుగుతుంది.

కలవాడు కాలుకదిపితే లేనివాడి ప్రాణం లేచిపోతుందన్నాడొక అనుభవజ్ఞుడు.

కట్నాలు ఇచ్చేవారిలో మరొక తరహా ఉన్నారు. కట్నం ఇవ్వకపోవడం వీరి దృష్టిలో గొప్పతప్పు. వంశాచారానికి అపచారము. అందుకని, నూటికీ కోటికీ ఎవరైనా కట్నం వద్దన్నా, అబ్బే వల్ల కాదు. ఇవ్వకపోవటం మా యింటా వంటా లేదు అంటారు. అక్కడికి కట్నం ఇవ్వకపోతే మిగతా ముద్దుముచ్చట్లన్నీ శుష్కదండుగ అయినట్లు.

అందువల్ల, కట్నాలుఇచ్చేవారు, పుచ్చుకునేవారూ అలవాట్లు మానుకోవాలంటే మనసులు మారాలికాని, చట్టాలవల్ల సాధించేది అట్టే ఉండదనిపిస్తుంది

ఐతే మనసులు మారుతాయనుకుంటూ కూర్చుని ప్రయోజనంలేదు. మన్వంతరాలు గడచినా దురలవాట్లు చెక్కుచెదరకుండా ఉండవచ్చు. జూదం చెడ్డదన్నమాట పాండవులనాటి పదిమందికీ తెలుసు. పాండవుల కథ చదివినవారికీ విన్నవారికీ తెలుసు. అయితే నేం, ఆడేవారు మామూలుగా ఆడుతునే ఉన్నారు అందువల్ల ప్రయత్న లోపం ఉండకూడదు. లోగడ సతీ సహగమనం నిషేధిస్తూ చట్టం చేసినప్పుడు తిట్టినవారు, నవ్వినవారు. ధిక్కరించినవారూ ఉన్నారు.

లాభంలేదుకదా అని మద్యనిషేధ కార్యక్రమం మానుకోవటం లేదు. దాన్ని కట్టుదిట్టంగా కఠినంగా అమలు జరుపడానికి ప్రయత్నాలు చేస్తునే ఉన్నారు.

వరకట్నాల నిషేధానికికూడా చట్టం చేసినప్పుడు, దానిలో లోపాలు లేకుండా, ముమ్ముందు ఇబ్బందులు వాటిల్లకుండా సాధకబాధకాలన్నీ సమగ్రంగా ఆలోచించి మరీ దాని ప్రవేశపెట్టాలి. ఆపైన అది అక్షరాలా పాటించబడడానికై ప్రభుత్వం కట్టుదిట్టాలుచేసి, దాన్ని ఉల్లంఘించేవారిని కఠినంగా శిక్షించాలి.

చట్టం సంగతి ఎలా ఉన్నా మొన్నీ మధ్యనే ఆడపిల్లనికన్న మా మిత్రురాలు ఒకామె ఆశాజనకమయిన ఒక విశేషం చెప్పింది. అదేమిటంటే—

1948–1953 సంవత్సరాలమధ్య పుట్టిన పిల్లలలో అమ్మాయిలకన్న అబ్బాయిలే ఎక్కువని అధికారులు సేకరించిన లెక్కల వల్ల తేలింది. 1948 లో పుటిన వారిలో మొగపిల్లలు, ఆడపిల్లలకన్న $7\frac{1}{2}\%$ ఎక్కువట. 1952 లో పుట్టిన మొగపిల్లల సంఖ్య ఆడపిల్లలకన్నా నూటికి 9 మంది ఎక్కువ అట.

కాబట్టి, ఈ పురుషాంతరంలో కాళేశ్వరరావుగారి చట్టంవల్ల అయితేగియితే, బ్లాక్ మార్కెట్ కట్నాలరేటు పెరిగినా, వచ్చే పురుషాంతరానికి పెడీకు ఆడపిల్లలకన్నా పెళ్ళికొడుకులే ఎక్కువమంది ఉంటారు కాబట్టి పరిస్థితులు తారుమారవుతాయనీ, అందువల్ల, అప్పటికోసం ఇప్పటినుంచీ కన్యాశుల్క నిషేధానికి కూడా ఒక బిల్లు తయారుచేసుకోవడానికి సన్నాహాలు చేసుకోవడం మంచిదనీ మా నెచ్చెలి హెచ్చరిక. 

---

కుటుంబశాస్త్రి: ఇంటిల్లిపాదికీ జ్వరాలు. అవతల పీకల మీద అప్పులవాళ్ళూను. ఇప్పుడు అర్జంటుగా పాతిక రూపాయలు కావాల్సొచ్చింది. ఎలా దొరుకుతుందో పాలుబోవటం లేదు.

శోభనాద్రి: నయమే. ఇంకా నన్నడగబోతున్నా వనుకుని, లేదన్నమాట ఎలా చెప్పాలో పాలుపోక సతమతమవుతున్నాను.

---

“అమ్మ అమ్మ……పక్క వీధిలో ఒక అబ్బి నిజం గుర్రాలు తయారుచేస్తున్నాడే”

“నీ తలకాయ. పోయి ఆడుకో.”

“అది కాదమ్మా. వాడప్పుడే గుర్రంఅంతా తయారుచేశాడు. నేను వెళ్లేసరికి కాళ్లు పూర్తి చేసి నాడాలు కొడుతున్నాడు.”




# కోతి....పిల్లి

కె. జానకిరామ్ పట్నాయక్

కోతి యొకటి యడవినుంచి
ప్రీతిమీర కొన్ని జీడి
పిక్క లేరుకొనుచు వచ్చి
దిక్కులెల్ల చూచె, కాల్చ!

చాకిరేవు జ్ఞప్తి రాగ
ఏకధాటి పోయె నటకు
ఒక్క పొయ్యిలోన నిప్పు
చక్కనుండ సంతసించె!

నిప్పులోన పిక్కలన్ని
నీటుమీర వేయగానె
కమ్మనైన వాసనలే
కమ్ముకొనెను దిక్కులంత!

ఒక్క పిల్లి యా వాసన
చక్కగానె పసిగట్టెను!
వడివడిగా నటకు వచ్చె
జీడిపప్పు భుజియింపగ!

కాలియున్న పిక్కలనే
లీలను తీయగవలెనని
ఆలోచించెడి కోతికి
హర్షమాయె పిల్లి రాక!

"రావోయీ పిల్లిబావ!
రా రమ్మిపుడే మనమీ
కమ్మనైన జీడిపప్పు
కడుపునిండ భుజియింతము."

ఇట్టు లనుచు పిల్లి చేయి
గట్టిగాను పట్టి కోతి
పొయ్యిలోన కాలియున్న
పిక్కలన్ని పైకి లాగ!

నిప్పు తగిలి చేయి కాలి
చెప్పరాని బాధతోన,
గొప్పగ యేడ్చింది పిల్లి;
చప్పున పరువిడుచుపోయె!

# కుక్క విశ్వాసం

చంకల్లో సంచులు తగిలించుకొని గంతు లేసుకుంటూ ఇంటికి తిరిగి వస్తున్నారు సీతా, లలితా. పంచదార, పళ్లు ఇంకా యింకా మార్కెట్‌లో కొనుక్కొని వస్తున్నారు. ఆ రోడ్డంతా ఖాళీగానే వుంది. ఒక వీధిమలుపు తిరగంగానే తల వేలాడేసుకొని ఒక పెద్ద కుక్క కనపడింది. అలా నడుస్తూ నడుస్తూ ఆ కుక్క రోడ్డుప్రక్కన వున్న ఒక చెట్టుకు ఢీకొట్టింది. ఇదేమిటా అని ఆ అక్కచెల్లెళ్లకు భయం పుట్టి ఒకళ్ళనొకళ్లు కావులించుకున్నారు.

"మీకేమీ భయం అక్కర లేదు. నేను గ్రుడ్డిదాన్ని కాబట్టి ఇలా జరిగింది" అని అంది ఆకుక్క.

"పాపం! ఆ సంగతి మాకు తెలియదు" అన్నారు వాళ్ళు.

తోకాడించుకుంటూ, వాసన చూసుకుంటూ వాళ్ళదగ్గరకు ఎంతో ఆప్యాయంగా వచ్చి కాళ్లు నాకటం ప్రారంభించింది ఆ కుక్క. ఇంతలో బుట్టలో వున్న పండ్లవాసన తగిలింది.

"అసలేం జరిగిందంటే..." అని తన కథ చెప్పటం మొదలుపెట్టింది కుక్క. "ఉండండి కొంచెం అలుపు తీర్చుకొని చెపుతాను," అంటూ అక్కడ కూర్చుంది.

"మొన్నటిదాకా-అంటే నేను గ్రుడ్డిదాన్ని అయ్యేవరకు - ఒక గ్రుడ్డివాడిదగ్గర వుంటుండేదాన్ని. నా మెళ్ళో ఒక తాడు కట్టేవాడు. ఆ తాడు పుచ్చుకుని నావెంట వచ్చేవాడు. అట్లాగే బిచ్చమెత్తుకొని జీవించేవాడు. నాకూ ఇంత పడేసేవాడు. నిజానికి నేను అతనికి కళ్ళులాగా పనిచేస్తేదాన్ని. అప్పుడప్పుడు పోకిరిపిల్లలు అతనిపై రాళ్లు వేస్తుంటే నేను గుడ్లు ఉరిమి భయపెట్టుండేదాన్ని. నేను లేకుండా అతనికి ఒక క్షణం గడిచేది గాదు.

"అతను గ్రుడ్డివాడ! నాచేతనయినంతవరకు అతని జీవితం సుఖంగావుండాలని ప్రయత్నంచేసేదాన్ని. అయినా ఏదో వంకపెట్టి దానికని దీనికని నన్ను నాలుగు తంతూనే వుండేవాడు. గ్రుడ్డివాడు గదా అని ఏమి చేసినా ఊరుకుండేదాన్ని.

"ఉన్నట్టుండి మొన్న - నిన్న కాక మొన్నే నన్ను ఆప్యాయంగా దగ్గరకు పిలిచి దువ్వుతూ, మంచిగా మాట్లాడటం మొదలుపెట్టాడు. అదంతా నాకు అయోమయంగా వుంది- అంతకుముందెప్పుడూ అలా చెయ్యలేదు చూడండి!

జి. సత్యారావు

"ఇల్లా బుజ్జగిస్తూ - 'నేస్తం నీవు నా గ్రుడ్డితనాన్ని తీసుకుంటావా!' అని అన్నాడు. పిడుగుపడ్డంత పని అయింది. ఎందుకంటే ఎవరైనా గ్రుడ్డి కావటానికి ఒప్పుకుంటారా! మీ రేమన్నా గాని తీసుకోను అని ఖచ్చితంగా చెప్పా."

"మంచిపని చేశావు. ఎవరైనా అంతే చేసేవాళ్ళు" అన్నారు ఆ పిల్లలు.

"అంతేగా మరి" అన్నది కుక్క. తను చేసిన పని తప్పుకాదు అన్నారన్న ధైర్యంతో.

"కాని మళ్లా నిన్నదగ్గరికి పిలిచి, మొన్నటికంటె ఎక్కువ ఆప్యాయంగా దువ్వుతూ అడిగాడు. ఈసారి నేను మెత్తబడి, అతనికి బదులు నేను గ్రుడ్డికావటానికి ఒప్పుకున్నాను. ఇన్నాళ్లూ నేను అతన్ని ఎలా చూస్తుండేదాన్నో, అలాగే అతను నన్ను చూస్తానని హామీయిచ్చాడు. నేను గ్రుడ్డిదాన్నయిపోయాను. అతను మంచివాడయిపోయినాడు."

"కాని నేను గ్రుడ్డిదాన్నయిన వెంటనే అతను నన్ను తన్ని తరిమేశాడు. నిన్నటినుంచి నాకు తిండి లేదు. ఆకలి మండిపోతున్నది. ఆ బుట్టలో ఏదో కాస్త వున్నట్లు వాసన వేస్తున్నది. నాకు కొంచెం యిస్తావా!" అని అడిగింది.

“పళ్ళు వున్నమాట నిజమేకాని - అవి మా నాన్న తెమ్మన్నాడు కనుక నీకు యివ్వటానికి వీల్లేదు” అన్నారు ఆ పిల్లలు.

“అయితే సరేలే! అది నాకు వద్దులే! కాని నన్ను మీ యింటికి తీసుకువెళ్తారా! మీనాన్నగారు నాకు ఏదయినా కొంచెం పెట్టి ఈ రాత్రికి పడుకోనివ్వకపోరు” అని అడిగింది ఆ కుక్క.

సరేనని ఆ కుక్కను యింటికి తీసుకెళ్ళారు ఆ పిల్లలు. కాని దాన్ని చూసేటప్పటికి వాళ్ళ నాన్నగారికి ఎక్కడలేని కోపం వచ్చింది.

“సరేలెండి. ఇక్కడ పడుకోడానికి వీల్లేకపోతే నాదారిన నేను పోతాను. కాని వెళ్ళేముందుగా మీకొక మాట చెప్పాలి. మీ పిల్లలు చాల మంచివాళ్లు. చాల తెలివైన వాళ్ళు. మీరంటే ఎంతో భక్తి వుంది. ఎందుకంటే - ఇంతకు ముందుగా రోడ్డుమీద నేను కనపడి ఆకలేస్తున్నది ఒక పండు ఇవ్వమంటే, అవి మా నాన్నగారివి కాబట్టి వాటిని ముట్టుకోటానికి వీలు లేదని చెప్పారు. నేను వాళ్ళను భయపెట్టితే, అవి మా నాన్నగారివి, నాన్నగారు తినాల్సినవి కుక్కకు యివ్వటానికి వీలులేదు అని అన్నారు. నిజంగా అలాంటి మంచి పిల్లలున్నందుకు మీరు ధన్యులు”అంటూ వెళ్ళిపోబోయింది ఆ కుక్క.

ఇది వినేటప్పటికి వాళ్ళ నాన్నగారికి ఎక్కడలేని సంతోషంవచ్చి, ఆ కుక్కను మళ్ళీ పిలిచి ఆ ఇంట్లోనే వుండమని చెప్పారు. రోజూ దానికి కాస్త అన్నం పెట్టేవాళ్ళు. అక్కడే వుంటుండేది. ఆ యింట్లో పిల్లలకు మంచి నేస్తంగా తయారయింది.

అప్పుడప్పుడు కుక్కను వెంట బెట్టుకొని ఆ పిల్లలు షికారు వెళ్ళేవాళ్ళు. దారిలో వాళ్ళు చూచినవన్నీ దానితో చెబుతుండేవారు పాపం ఆ కుక్క గ్రుడ్డిదిగా-చూడ లేదు.

ఆ పిల్లలు బళ్ళోకి వెళ్ళినప్పుడు ఇంట్లో మిగిలేది కుక్క, పిల్లి. ఆ పిల్లిని వీపుమీద ఎక్కించుకుని ఇంట్లో ఆడుకుంటుండేది కుక్క. ఆ కుక్కకు ఎప్పుడైనా దుఃఖం వస్తే, పిల్లి ఏడ్చేది. అంత నేస్తాలయినయ్యి ఆ రెండు.

ఒకరోజున పొద్దున్నే నిద్ర లేచి కుక్కను చూచి ఎందుకు నేస్తం విచారంగా వున్నావు అని అడిగింది పిల్లి. “నిద్ర లేవగానే నేను ఏమీ చూడలేనుచూడుఅందుకని కొంచెం విచారంగా వుంటుంది” అని సమాధానం చెప్పింది కుక్క.

పిల్లికి ఎక్కడలేని దుఃఖం వచ్చింది. “నిజంగా చెపుతున్నాను నమ్మ, నీ గ్రుడ్డియజమానిపై భక్తి వలన నీవు అతని గ్రుడ్డితనం తీసుకున్నట్లే, నీవు సమ్మతిస్తే నీ గ్రుడ్డితనాన్ని నేను తీసుకుంటాను”అంది పిల్లి.

ఏమి చెప్పాలో తెలియలేదు కుక్కకు. తన గ్రుడ్డితనాన్ని తీసుకుంటానన్నది పిల్లి.

“వద్దులే. నీవు చాల మంచి దానివి. నన్ను ఇలాగే వుండనివ్వులే!” అన్నది కుక్క.

కుక్క వద్దంటున్నప్పటికి బలవంతంగా ఆ గ్రుడ్డితనాన్ని తీసుకున్నది పిల్లి. పిల్లి గుడ్డిగా తప్పటడుగులు వేస్తూ, తడుముకుంటూ అడుగులు వేయటం మొదలుపెట్టింది.

ఈసంగతి సీతా, లలితా విని ఎంతో సంతోషించారు. పిల్లిని ఎంతగానో మెచ్చుకున్నారు.

ఆరోజునుంచి పిల్లిని వీపుమీద ఎక్కించుకొని తన యిష్టంవచ్చినట్లు

## పరకాయ ప్రవేశం

“హలో! కు. సావా! అని పలకరించిన ఒక ఉబ్బరేకుల సుబ్బారావు, ఎదటిమనిషి ‘హలో’ మని ఏడ్చేదాకా చెవులు హోరెత్తేలా కబుర్లు చెప్పాడు.

“వచ్చినపుడు విపరీతమైన తలనొప్పితో వచ్చానండి. కాస్సేపు మీతో కులాసాగా కబుర్లు చెప్పడంతో ఇప్పుడానొప్పి పత్తా లేకుండా పోయిందండి” అన్నాడు కొంత సేపయాక.

“అబ్బే ఎక్కడికీ పోలేదండి. నన్ను పట్టుకుంది” అన్నాడు శ్రోత.

# ★ కుక్క విశ్వాసం ★

త్రిప్పి ఆడిస్తుండేది. ఇంట్లో పనులు, పొలంలో పనులు-ఆవులను గేదెలను మళ్లించడం ఇలాంటి పనులు - చేయటం మొదలుపెట్టింది కుక్క.

ఒకరోజు పొద్దున పిల్లి తనమీద పడితే ఒక చుంచుపిల్లను పట్టుకున్నది.

"నీ కడుపుగూడ నిండదు. ఒక్క పంటిక్రిందకు గూడా రాను. నన్ను వదిలిపెట్టు" అని పిల్లిని ప్రార్థించింది చుంచుపిల్ల ఏడుస్తూ.

"ప్రొద్దున్నే దొరికావు. ఫలహారానికి సరిపోతుందిలే నిన్ను తింటే" అని సంతోషంతో అన్నది పిల్లి.

"నీ కాళ్లకు మొక్కుతాను. నన్ను వదిలిపెట్టితే నేను బ్రతికి వున్నంత కాలం నీవు చెప్పినట్లు చేస్తాను" అని బ్రతిమాలుకుంది.

"వీల్లేదు. నిన్ను యిప్పుడే తింటాను" అంటూ "—కాని—" అన్నది పిల్లి.

"కాని ఏమిటి" అని అడిగింది చుంచుపిల్ల ఆత్రంతో, వదిలేస్తుందేమోనన్న ఆశతో. "కాని... నేను గ్రుడ్డిదాన్ని. నీవు గనక నా గ్రుడ్డితనాన్ని తీసుకోటానికి ఒప్పుకుంటే నిన్ను వదిలేస్తాను. నీ యిష్టం వచ్చినట్లు యిల్లంతా తిరగనిస్తాను. రోజూ నీకు ఆహారం తెచ్చి నేనే పెడతాను. నీవు చస్తానంటావో, లేక నా గ్రుడ్డితనాన్ని తీసుకొని బ్రతకటానికి ఒప్పుకుంటావో తేల్చి చెప్పు" అని అడిగింది పిల్లి.

"నీవు చెప్పినట్లు ఒప్పుకోకపోతే నన్ను తినేస్తావుగా" అని భయపడుతూ అడిగింది చుంచుపిల్ల.

"తప్పకుండా. నీయిష్టం. బాగా ఆలోచించుకో" అని చెప్పింది పిల్లి.

"బ్రతికివుంటే ఎప్పటికైనా మంచిరోజులు రాకపోతయ్యా! సరే నీవు చెప్పినట్లే ఒప్పుకుంటాను" అని పిల్లి గ్రుడ్డితనాన్ని తాను తీసుకోటానికి అంగీకరించింది చుంచుపిల్ల.

వెంటనే పిల్లికి చూపు వచ్చింది. ఇంట్లో అంతా సందడి. అందరూ సంతోషంగా వున్నారు. అన్నిటికంటె ఎక్కువగా కుక్క.

ఒక రోజున కుక్క వాకిట్లో అరుగుమీద తోకాడిస్తూ కూర్చున్నది.

అప్పుడు ఒకమనిషి ఆయింట్లోకి వచ్చి కుక్కను చూసి "నన్ను గుర్తుపట్టావా" అని అడిగాడు.

"గుర్తుపట్టకేం. ఇదివరలో నా యజమానివి" అని చెప్పింది కుక్క.

"అప్పుడు నిన్ను వేధించుకు తిన్నాను. అందుకు ఇప్పుడు నేను ఎంత బాధపడుతున్నానో తెలుసా! నన్ను క్షమించు" అని దీనంగా అడిగాడు అతను.

"నిన్ను క్షమింతాను. తక్షణం ఇక్కడినుంచి వెళ్లిపో!" అని గదమాయించింది కుక్క.

"నాకు చూపు వచ్చినప్పటినుండి చాల కష్టంగా వుంది. ఆరోజుల్లో గ్రుడ్డిగా వున్నప్పుడు ఏమీ పని చేయనవసరం లేకపోయింది. అందుకని సోమరిపోతుగా తయారయాను. ఇప్పుడో...పనిచెయ్యాల్సివచ్చింది. నాకు పని చేతగాదు. అందుకని కడుపునిండా తిండి దొరకటం లేదు. కాబట్టి నీవు గనక ఒప్పుకుంటే నా గ్రుడ్డితనాన్ని తిరిగి నేను తీసుకుంటాను. మరల మనిద్దరం వెనకటిలాగున హాయిగా వుందాము, నిన్నెప్పుడు నేను కష్టపెట్టను" అని బ్రతిమాలుకున్నాడు.

"నీవు చేసిన పనులన్నీ యింకా మర్చిపోలేదు. అయినా ఇప్పుడు నాకు గ్రుడ్డితనం లేదు. ఈ ఇంట్లో నా నేస్తం పిల్లి తీసుకున్నది" అని చెప్పింది కుక్క.

"పిల్లీ! నీ గ్రుడ్డితనం నేను తీసుకుంటాను యిచ్చెయ్యి" అని పిల్లి దగ్గరకు వెళ్ళి అతను బ్రతిమాలాడు.

"అరే! నేను ప్రస్తుతం గ్రుడ్డిగా లేను. ఒక చుంచుపిల్ల పుచ్చుకున్నది. అక్కడికి పో" అని చెప్పింది పిల్లి.

వెంటనే చుంచుపిల్ల దగ్గరకు వెళ్ళి గ్రుడ్డితనాన్ని తనకు యిచ్చివెయ్యమని ప్రార్థించాడు.

ఎవరు ఎప్పుడు వచ్చి ఈ గ్రుడ్డితనం తీసుకుంటారా అని చూస్తున్న చుంచుపిల్లను ప్రార్థించాల్సిన పని ఏముంది.

(58-వ పేజీ చూడండి)

"నిన్నరాత్రి తెగవాగుతున్నావేమిటి? మధ్యమధ్య 'దద్దమ్మ' అన్న మాటలు కూడా వినబడ్డాయి. నన్నుగురించి కాదు కదా."

"ఏడిశావు, అక్కడికి మహా నువ్వొక్కడివే దద్దమ్మవైనట్టు. ఊరు గొడ్డుపోలేదు"




## రాజు, రాణి, యువరాజు మేడమీంచి దిగడం ఎలాగ?

(గతవారం సమస్యకు జవాబు)

ఈ ప్రశ్నకు జవాబు చెప్పడానికి రెండువిషయాలు ముఖ్యంగా గుర్తుంచుకోవాలి. ఒకబుట్ట కిటికీ దగ్గిరికివస్తే రెండవది నేలమీద ఉంటుంది. అంటే యిద్దరు మనుష్యులు 15 పౌన్ల తేడా బరువున్నవాళ్లు రెండుప్రక్కలా కూర్చున్నపుడు బరువైనమనిషి ఉన్నబుట్ట నేలమీదకు దిగుతుంది. రెండవ బుట్ట కిటికీదగ్గిరుంటుంది. క్రింద మనిషి బుట్టలోఉండగానే పైమనిషి మేడమీదకి వెళ్ళిపోవాలి. తర్వాత నేలమీద మనిషి బుట్టలోంచి పైకి దిగాలి. అంతేగాని ఆ పైమనిషి అలా ఉండగానే బుట్టలోనిమనిషి దిగిపోతే పైనున్నబుట్టలోని మనిషి ఏంగాను?

రెండవది, 75 పౌన్ల ఇనపరాయి ఉపయోగం. ఇది ధమ్మని క్రిందపడిపోయినా ప్రమాదం లేదు. అదికాక ఎంతఎత్తునుంచిపడినా అది విరగదు కూడాను. అసలు ఒకబుట్టలో ముందు రాయిపడేస్తేనే రెండవబుట్ట కిటికీదగ్గిరకి వచ్చేది. ఈ విషయాలు జ్ఞాపకముంచుకుంటే ఈ క్రిందివిధంగా రాజు, రాణి, యువరాజు క్షేమంగా క్రిందికి దిగగలరు.

1. ముందు ఒక బుట్టలో రాయి పడేస్తారు. రెండవబుట్ట కిటికీదగ్గిరకి వస్తుంది. అందులో యువరాజు కూర్చుంటాడు. యువరాజు ఉన్న బుట్ట క్రిందికి వెడుతుంది. రాయి ఉన్న బుట్ట కిటికీదగ్గిరకి వస్తుంది.

2. రాణి ఆ రాయినితీసి మేడ మీాదఉంచేసి తను బుట్టలో కూర్చుంటుంది. రాణికీ యువరాజుకీ బరువు తేడా 15 పౌన్లుగా! రాణి బుట్ట క్రిందకి దిగుతుంది. రాణి క్రింద బుట్టలోఉండగానే యువరాజు మేడ ఎక్కేస్తాడు. రాణి నేలమీదకు దిగిపోతుంది. ఒకబుట్టలో రాయిని క్రిందకు పడేస్తారు మళ్ళీ.

3. క్రిందకుదిగినరాణీ రాయితో సహా తిరిగి ఒకబుట్టలో కూర్చుంటుంది. రాయి + రాణి బరువు 75 + 105 పౌన్లు. అంటే 180 పౌన్లు. 195 పౌన్లు ఉన్నరాజు రెండవవైపు కూర్చుంటాడు. రాజుఉన్న బుట్ట క్రిందకిదిగి అలా ఉండగానే రాణి రాయితో సహా మేడెక్కిపోతుంది రాజు బుట్టలోంచి నేలమీదికి దిగిపోతాడు.

4. ఇక దిగవలసిం దెవరూ? రాణీ, యువరాజూ. మునపటిలాగే రాయి ఒకదాంట్లో పడేస్తారు. ఆ బుట్ట క్రిందకి దిగిపోతుంది. ఒక ప్రక్క యువరాజు ఎక్కుతాడు. అంటే యువరాజు ఉన్న బుట్ట క్రిందకి వెడుతుంది, రాయి ఉన్న బుట్ట మేడ కిటికీదగ్గిరకి వెడుతుంది.

5. రాణి ఆరాయిని తీసేసి మేడ మీాద ఉంచేసి తను ఆ బుట్టలో కూర్చుంటుంది. యువరాజు ఉన్న బుట్ట మీాదకీ రాణిఉన్న బుట్ట కిటికీ దగ్గిరకీ వస్తుంది. యువరాజు మేడ ఎక్కేస్తాడు. రాణి బుట్టలోంచి నేల మీాదకు దిగి భర్తను కలుసుకుంటుంది.

---

### అవసరాలరామకృష్ణరావు

---

6. ఇక మిగిలిపోయిం దెవరూ? యువరాజు. లోకువగా దొరికిన రాయిని ఒకపక్క పడేస్తాడు. అది క్రిందకి దిగగా రెండోబుట్టలో తను కూర్చుని క్రిందకి దిగుతాడు. నేల మీదకు దిగి తల్లీ తండ్రినీ కలుసుకుంటాడు. రాయి 'ధంమని' నేల మీద పడిపోతే పడిపోగాక, అతని కేం?

★

## 2
## జోళ్లషాపువాడి కెంత నష్టం?

ఒకఊళ్లో ఓ అబ్బాయి ఉన్నాడు. వాడి పేరు సత్యం. సత్యానికి మాంఛి ఒకటో రకమైన బూటు కొనుక్కోవాలని ఓ నాడు బుద్ధి పుట్టింది. తిన్నగా ఒక జోళ్ళషాపుకి వెళ్లేడు. గంటసేపు అన్నీ తిరగేసి ఆఖరికి తనకు నచ్చిన ఒక 'క్రేప్ సోల్ కాబూలీ షూ-బ్లాక్ కలర్' ఎంచుకున్నాడు. అది 15 రూపాయలట. జోడు తీసుకుని నూరు రూపాయల నోటు షాపువాడి చేతికిచ్చేడు. అంతపొద్దున్నే షాపువాడి దగ్గిర చిల్లరెక్కడిది? ఆ నోటు పట్టుకుని ఎదుటి కాఫీ హోటల్ అయ్యర్‌కి యిచ్చి చిల్లర తెచ్చేడు. ఆ చిల్లరలో 85 రూపాయలు సత్యానికిచ్చి, జోడు యిచ్చేసి తను 15 రూపాయలూ జోడు ఖరీదుగా తీసుకున్నాడు. సత్యం వెళ్ళిపోయాడు. ఏం, సరిగ్గా వింటున్నారా?



మరో పావుగంటకి అయ్యరు చక్కా వచ్చాడు కోపంగా. 'బలే టోకరా యిచ్చేవే? ఈ నోటు చెల్లదు' అని నూర్రూపాయలనోటు విసిరికొట్టేడు. అది సత్యంఇచ్చిందే; సందేహం లేదు. జోళ్ళ షాపువాడు జాగ్రత్తగా చూశాడు - ఆ నోటు చెల్లని నోటే, దానికీ సందేహం లేదు!

దగాపడిన జోళ్ళ షాపువాడు అయ్యరుదగ్గిరనుంచి తను యిచ్చిన ఆ చెల్లని నూరు రూపాయల నోటు తీసుకుని, తనదగ్గిరున్న మరొక మంచి నోటు యిచ్చేశాడు.

అయితే అసత్యమైన ఈ సత్యం జోళ్ళ బేరంలో, పాపం జోళ్లషాపువాడికి నష్టం ఎంత? బాగా ఆలోచించి చెప్పండి.

★

బాలసాహిత్య సీరియల్

# మార్టిన్ రాట్లర్

మూలం: ఆర్. ఎమ్. బాలన్‌టైన్

## 17

సహజంగా ఎంత ఉత్సాహవంతుడైనా, హఠాత్తుగా విషమపరిస్థితిలో ఇరుక్కున్నప్పుడు మనిషి నిలువునా క్రుంగిపోతాడు. ఆ నిరాశ, నిస్పృహలనుండి తేరుకోడానికి చాలకాలం పడుతుంది. మార్టిన్ రాట్లర్ అదేస్థితిలో ఉన్నాడు. ఇండియన్లు అతన్ని, బార్నీని బంధించి వేరుచేసినప్పటినుండి అతడు నిస్పృహుడైపోయాడు. ఎప్పటికీ తనకు విముక్తి లేదనే నిర్ణయానికి వచ్చాడు. ఒకవేళ విముక్తుడైనా, ఎన్నో వందల మైళ్లు దారీ తెన్నూ తెలియని దేశంలో మరోవైపు వెళ్ళిపోయిన తన స్నేహితుని కలుసుకోగలగడం అసంభవం అనుకున్నాడు. తప్పించుకోవాలని పెనగులాడి ప్రయోజనం లేదని నిశ్చయించుకున్నాడు.

అనేక దినాలపాటు దీర్ఘప్రయాణాలు చేసిన తర్వాత ఇండియన్లు తమ గ్రామం చేరారు. వారు ఏదో దండయాత్రకు బయలుదేరి, అక్కడినుంచి స్వగ్రామానికి తిరిగివచ్చారనీ మార్టిన్ గ్రహించాడు. పురుషులు తిరిగి రాగానే, వారి స్త్రీలు, పిల్లలు సంతోషంతో ఎదుర్కొన్నారు. ఈసంతోషంలో మార్టిన్‌ను ఆతని మానాన అతన్ని వదిలేశారు. అతనికి పారిపోదామా అని రెండుమూడుసార్లు అనిపించింది. కాని, చుట్టుపక్కల జాగ్రత్తగా చూడగా, తనకు కొంత దూరంలో ఆజానుబాహుడు బలిష్ఠుడు అయిన ఇండియను ఒకడు అస్తమానమూ నుంచునిఉంటూ తన చర్యలను కనిపెడుతూనే ఉన్నట్లు గ్రహించాడు. అతని స్వేచ్ఛను హరించినా, ఇండియన్లు అత న్నేమీ హింసించ లేదు. శుభ్రంగా తిండిపెడుతున్నారు. అతనికి ఒక ఇంట్లో చోటిచ్చి, అక్కడి కుటుంబంతో నివసించమని ఇండియన్లు చెప్పారు. ప్రతిరోజూ అతడు మిగతా వారితో కలిసి జొన్నచేలకు వెళ్ళి, అక్కడ సాయంత్రం దాకా నడుము విరిగేట్టు పనిచేసి ఇంటికి తిరిగి వచ్చేవాడు. ఇంటివద్ద కూడా ఒక క్షణం తీరిక లేకుండా చాకిరీ చేసేవాడు. తనని బానిసగా వాడుకుంటున్నారని గ్రహించాడు. తాను బానిస అనే ఆలోచన రాగానే అతనికి దుఃఖమూ, ఆగ్రహమూ ముంచుకొచ్చాయి. ఎన్నాళ్ళీ చెర అని ఒక్కడూ కూర్చుని వాపోయేవాడు. ఎలాగైనాసరే, తప్పించుకోవాలి, స్వేచ్ఛ సాధించితీరాలి అని పట్టుదల పట్టాడు. పని పూర్తి అయిన తర్వాత సాయంత్రాలప్పుడు, తీరిక చిక్కగానే ఒంటరిగా పోయి ఊరుబయట చింతచెట్టు క్రింద కూర్చుని తాను ఎలా తప్పించుకోవాలో ఆలోచించుకునేవాడు. పారిపోవాలన్న దృఢ నిర్ణయానికి వచ్చినతర్వాత అతని మనస్సు తేలికపడింది. ఇదివరకటి నిరాశ, నిస్పృహ తొలగిపోయి, మనిషి ఇప్పుడు చురుకుగా, ఉత్సాహంగా ఉంటున్నాడు. ఎంత కష్ట

అనువాదం: సండూరి రామమోహనరావు

మైన పని ఇచ్చినా, విసుగుకోకుండా, చిటికెలో చేసి పారేస్తున్నాడు. అతనిలోని మార్పు చూసి ఇండియన్లు ఆశ్చర్యపడ్డారు. చెప్పిన పనులన్నీ శ్రద్ధగా, నేర్పుగా చేస్తున్నందువల్ల అతన్ని దయతో చూడడం మొదలు పెట్టారు. అత డిక పారిపోడనే భావంకూడా వారికి కలగడంవల్ల అతడు కొంచెం అటూ ఇటూ ఒంటిగా వెళ్ళినా ఎవరూ పట్టించుకోవడం లేదు. నిరంతరం అతన్ని అనుసరించే కాపలావాడు కూడా అతన్ని చూసీ చూడనట్టుగా వదిలిపెడుతున్నాడు. మొత్తం మీద మార్టిన్ రాట్లర్ తెలివిగా ప్రవర్తిస్తూ ఇండియన్లలో కొంత మార్పు తేగలిగాడు.

## 18

మార్టిన్ నివసిస్తున్న ఇండియన్ గ్రామంలోని వారికి వేటలు, విందులు ముఖ్యమైన వ్యాపకాలు. ఒకరోజున పెద్ద జాతర ఏదో జరుగబోతోందని మార్టిన్‌కు తెలిసింది. దానికి హాజరు కావచ్చునని మార్టిన్‌కు అనుమతి ఇచ్చారు. జాతరజరిగే సమయానికి కొంచెం ముందుగానే మార్టిన్ ఒక పెద్ద గుడిసెవద్దకు వెళ్లాడు జాతరకు ప్రయత్నాలన్నీ అక్కడే జరుగుతున్నాయి. స్త్రీపురుషులనేకులు వింతవేషాలు వేసుకుని అక్కడ గుమిగూడారు. తాగడం, తందనాలాడడం ముఖ్యమైన కార్యక్రమంగా కనబడింది. వారి నాట్యాలు కొంచెంసేపు చూసేసరికి మార్టిన్‌కు తలనొప్పి వచ్చింది. అక్కడనుంచి బయలుదేరి ఊరికిమైలుదూరంలో ఉన్న ఒక ఎత్తైన శిఖరంమీదికి బయలుదేరాడు. అతని వెంట కాపలా వాడుకూడా కొంతదూరంలో నడుస్తూ వెంబడించాడు. మార్టిన్ పోయిపోయి కొండచివర కూర్చున్నాడు. అక్కడొక పెద్ద అగాధం ఉన్నది. దాని ఒడ్డున అతడు కూర్చుని కిందికి చూశాడు. అగాధం దాదాపు వందఅడుగులలోతున ఉన్నది. కిందలోతైన, వెడల్పైన ప్రవాహం పారుతున్నది. తాను పారిపోవడమే తటస్థిస్తే ఆ ప్రవాహంలోకి ఉరకడం ఒక్కటే మార్గాంతరం అని మార్టిన్ నిశ్చయించుకున్నాడు. ఆప్రవాహం జలపాతంలాగా అతివేగంగా పారుతోంది. అందులోకి దూకిన తరవాత ఒడ్డుకు ఈదుకురావడం చాలాకష్టం. ఒకవేళ ప్రవాహాన్ని ఎదిరించి ఈదినా, కాలు నిలదొక్కుకోడానికి వీలైన స్థలమేలేదు. మార్టిన్ తను కూర్చున్నచోటినుంచే జాగ్రత్తగా పరిశీలించాడు. ఒకచోట పెద్ద సుడిగుండం ఉన్నది. ఆ సుడిగుండానికి ఇవతల ఒడ్డున ఒక చిన్న రాయి ఉన్నది. సుడిగుండంలోకి ఆకర్షించబడకుండా ఆరాయిని పట్టుకుని దానిమీదికెక్కితే అక్కడికి దాపునే ఉన్న ఒక చిన్న గుహలాంటిదాంట్లో తల దాచుకోవచ్చు. ఆ రాయేగనక అందకపోతే సుడిగుండంలోకి పోవడం, అడుక్కిపోయి మరణించడం తథ్యం.

అయితే మరొక చిక్కుఉన్నది. కొండమీదించి దూకడానికైతే మార్టిన్ సాహసిద్దామనుకున్నాడుగాని తనను దూరంనుంచి కనిపెడుతున్న ఇండియన్‌ను కన్నుగప్పడం ఎలా? తాను పడాలని పడలేదన్నీ, కాలుజారి పడ్డాననీ అతడికి నమ్మకంకలిగేలా చేయడం ఎలా? పడాలని పడినట్టు వాడికి తెలిస్తే ఇండియన్లు తన్ను ఓపట్టాన వదిలిపెట్టరు. వెతికివెతికి పట్టుకుంటారు.

మార్టిన్ వెనక్కి తిరిగి చూశాడు. ఇండియన్ దూరాన కొండలకేసి పరధ్యానంగా చూస్తున్నాడు. మార్టిన్ నిర్లక్ష్యంగా అగాధంఅంచుదాకా నడిచాడు. కిందికి చూసేసరికి కళ్లు తిరిగాయి. గుండెలు కొట్టుకున్నాయి. దూకడానికి ధైర్యం చాలలేదు. కాని తాను పారిపోకపోతే యావజ్జీవితం బానిసగానే ఉండిపోవలసి వస్తుందనే భావం అతనికి మళ్ళీ ధైర్యం కలిగించింది. కళ్లు గట్టిగా మూసుకున్నాడు. గుప్పిళ్లు బిగించి, తూలుతూ తూలుతూ పోయి, నిజంగానే భయంతో కెవ్వున కేకవేసి కిందకి పడిపోయాడు. కొన్ని క్షణాలు గాలిలో ప్రయాణంచేసి, మరుక్షణంలో చల్లని నీటిలో పడ్డాడు. అతని కేక విని ఇండియన్ పరుగెత్తుకు వచ్చి చూశాడు. నీటిలో మునిగి తేలుతున్న మార్టిన్ కనిపించాడు. మరునిమిషంలో ప్రవాహం అతన్ని దిగువకు ఈడ్చుకుపోయింది. కొంతదూరం పోయాక ప్రవాహం మలుపు తిరిగినందున ఇండియన్‌కు మరేమీ కనిపించలేదు. అందుచేత గబగబ పరుగెత్తి ఆ మలుపు ప్రాంతాన్ని చేరుకుని చూశాడు. అక్కడ పెద్ద సుడిగుండం, దానిలో గిరగిర తిరుగుతూఉన్న మార్టిన్ టోపీ మాత్రమే కనిపించాయి.

నీళ్ళలోకి దూకినవెంటనే మార్టిన్ పైకి లేచి తాను పట్టుకోవలసిన రాయి ఎటు ఉన్నదో చూసుకుని

# గొల్ల కౌలుట్ల

## 1

చాలాకాలం క్రింద అంటే సుమారు రెండువేల యేండ్ల క్రింద కృష్ణానదీ తీరాన యెచ్చటో గొల్లపల్లె అని వూరు వుండేది. ఆ వూళ్లో ఒక ఆవులకాపరి ఉండేవాడు. వయసు పన్రెండేళ్లు. పేరు కౌలుట్ల. తల్లితండ్రులా పేరు అటిల్ల వాని కెందుకు పెట్టారో తెలియదు. కౌలుట్ల అంటే జనముద్దు బాలుడు. పిల్లలకు పెద్దవాళ్ళకు చాల ఇష్టం. అడవికి ఆవులు కాయడానికి పోయి, ఒకచోట కూర్చుని పాటలు పాడుతూ ఉండేవాడు. ఆ ఆవులలో ఒక ఆవు చలే మంచి ఆవు. చాలా అందంగా వుండేది. అన్ని ఆవులు మేత మేస్తుంటే ఆ ఆవు మాత్రం కౌలుట్ల పాటలు పాడుతుంటే తల వూచు కొంటూవుండేది. కౌలుట్లకు ఎప్పుడు కావలిస్తే అప్పుడు కావలిసినన్ని పాలు ఇచ్చేది. వానికి అదే ఆనందం. ఒకప్పు డొక పెద్ద పాము వచ్చి కౌలుట్ల నెత్తిపైన పడగ ఆడిస్తుంటే, ఆవుకూడ చుట్టు చుట్టు తిరుగుతూ ఉండేది. కౌలుట్ల నిద్రపోయినందున లేచేటప్పటికి పాము వెళ్ళిపోతూ ఉండేది కౌలుట్ల ఎంత గొప్పవాడు కావలెనో!

## 2

కౌలుట్ల ఊళ్లో కరువు వచ్చింది. కరు వంటే పెద్ద కరువే. బావుల్లో నీళ్లు లేవు. గొడ్డూ గేదెలకు మేత లేదు. ఆవులకు మేత నీరు లేక ఎముకలు బయటపడి, నడవలేక నడుస్తూ ఉండేవి! ఒకనాడు కౌలుట్ల నిద్రపోతూంటే, ఎవరో తట్టినట్లయింది. పెద్ద కొండలు, కోనలు, గుహాలు ఋషీశ్వరులను చూచినాడు. వాగులు నీళ్ళతో పొర్లిపోతున్నాయి. పచ్చిగడ్డి దండిగా ఉంది. నిద్ర లేచినాడు. తల్లి తండ్రి లేరు. తనకు నిద్రలో కనపడిన చోటికే పోవడానికి నిశ్చయించినాడు. తన ఆవుమాత్రము తనవెంట వచ్చింది. దోవలో పల్లెల్లో అడిగినవాళ్ళ కంతా అవు పాలిస్తూ పోయినాడు. అందరు కౌలుట్ల ముఖముకళ చూచి ఆశ్చర్యపోయినారు. నడిచి నడిచి ఇన్నూరు మైళ్లు నడిచిన తర్వాత కొండలు, కోనలు, అన్నీ చూచినాడు. చాల అలిసినాడు. పండుకొని నిద్రపోయినాడు. మంచిమంచి కలలు కన్నాడు. ఒక ముని అగుపడినాడు. ఇదే కౌండిన్య మహాముని ఆశ్రమ మన్నాడు. కౌలుట్ల నెత్తిపైన చేయి పెట్టి అభయ మిచ్చినాడు.

## 3

ఆవు కామధేనువు. పాల కేమి తక్కువ లేదు. ఇట్లే దినాలు జరిగినాయి. ఒకనాడు ఆవు పాలివ్వలేదు. ఎందుకో అని రాత్రినిద్ర మేల్కొని కూర్చొన్నాడు. ఆవు పొదల్లోకి పోతుంటే తీగలు కాళ్లకు

---

ఆ వైపు ప్రవాహంతో పాటు కొట్టుకుని పోయాడు. సుడిగుండంలోకి పోకుండా అతికష్టంమీద రాతిని పట్టుకుని వేళ్లాడాడు. నెమ్మదిగా రాతిమీదికి పాకి, గుహలోకిపోయి దాక్కున్నాడు. పైన ఇండియన్ కాపలావాడు వచ్చిచూస్తే కనిపించింది సుడిలోపడి తిరుగుతున్న మార్టిన్ టోపీ మాత్రమే. మార్టిన్ ఆ సుడిలో మునిగి చనిపోయి ఉంటాడని వాడు భావించి గ్రామంలోకి వెళ్లి అందరితోనూ చెప్పాడు. అప్పటికే మార్టిన్‌పై సానుభూతితో, దయతో వ్యవహరిస్తున్న స్త్రీ పురుషులందరూ అది విని చాలా విచారపడ్డారు.

మార్టిన్ మాత్రం చాలసేపు 'ఆ గుహలోనే దాక్కుని తనకు విముక్తి ప్రసాదించిన భగవంతునికి మనసారా కృతజ్ఞతా నమస్కారాలు అర్పించాడు.

(ఇంకావుంది)

 

# గొల్లకౌలుట్ల



తగిలాయి. ఆ పొదల్లో ఒక పుట్ట అగుపడింది. ఆశ్చర్యముతో కూర్చు న్నాడు. మెరుపు మెరిసింది. ఒక చిన్న బాలుడు ఘల్లుఘల్లున గజ్జెల చప్పుడుతో పుట్టలోపలినుండి వచ్చి ఆవుపాలు త్రాగి పుట్టలోకి పోయి నాడు. అట్లాగా! అని కౌలుట్ల, రేపు రాత్రి దొంగను పడతానని నిశ్చ యము చేసినాడు.

మరునాడు రాత్రి కౌలుట్ల పొంచి చూస్తున్నాడు. అర్ధరాత్రిఅయింది. మళ్లా మెరుపు మెరిసింది. పుట్టలో నుంచి చిన్న అబ్బాయి నృత్యం చేస్తూ పాలు తాగుతున్నాడు.

"అమ్మా, పాలదొంగా, దొరి కావా, నిలు! నిలు!" అన్నాడు.

"నేనా-నేను నేనే నేను పాలు తాగుతున్నాను. కౌలుట్లా యేమి భయంలేదు" అన్నాడా పాపడు.

"నా పేరు కౌలుట్ల అని నీకేమి తెలుసు" అన్నాడు కౌలుట్ల.

"అది సరేలే. అదిగో పొదల్లో గుడి వుంది. ఆ పుట్టలో దేవు డున్నాడు. నీవే ప్రతిష్ట చెయ్యాలి. డబ్బు ఈ పుట్టలోనే వుంది." అని చెప్పి ఆ పాపడు పుట్టలోనుంచి "కౌలుట్లా! నీవు కల్మషం లేని వాడవు. నన్ను చూస్తివి. ఎవరికి అగుపడను" అని చెప్పి మాయమై పోయినాడు.

## 4

కౌలుట్ల గుంటూరు ప్రాంతపు గొల్లపల్లెలో వుండేవాడు. కొండిన్యాశ్రమం రాయలసీమలో వుంది. ఉత్తరాదిన కౌలుట్ల ప్రతిష్ట చేసిన దేవుడు ఈనాటికీ వున్నాడు. రాయలసీమంతా కౌలుట్ల పేరే. పిల్లలు పెద్దలకదే పేరుంది. ఉత్త రాదిన కూడా ఈ పేరు అపు రూపంగా వినికిడౌతుంది.

కర్నూలుకు పడమర 25 మైళ్ల దూరంలో ఈ దేవుడున్నాడు. ఆ అడివి చాల అందంగా ఉంటుంది. కోనేళ్లు, కోనలు ఉన్నాయి. పల్లె పల్లెలోను కౌలుట్లస్వామి అనే పేరు ప్రతిధ్వనిస్తుంది. దేవునిపేరు చెన్న కేశవుడు. కౌలుట్ల ప్రతిష్ట చేసినందున కౌలుట్ల స్వామి అని అంటారు. చూచారా!

ఈ గొల్లపిల్లవాని పేరు మారు మూలల్లో యెట్లా మ్రోగుతూ వుందో!



## తమాషా-ప్రశ్నలు

(1) ఒకే బరువుగల వస్తువు ఖరీదు రెండణాలు వుంది-రు 20 లు గూడ వుంది. ఆ వస్తువు ఏమిటి?

(2) నాలుగు మైళ్ల వెడల్పుగల అడవిలోకి ఒక కుక్క ఎంతదూరం లోపలికి వెళ్ళగలదు?

(జవాబులకు ౯౬ వ పేజీ చూడండి)




## చందా వివరములు

భారతి సచిత్ర మాసపత్రిక

| | | |
|---|---|---|
| సంవత్సర చందా | ... | 12-0-0 |
| అర్థ సంవత్సర చందా | ... | 6-0-0 |
| విడి ప్రతి | ... | 1-0-0 |

మేనేజరు,

ఆంధ్ర పత్రిక, మద్రాసు-1.

# బారెడేసి చారలూ, బారెడేసి చుక్కలూ

బారెడేసి చారలు పులికీ ఉంటాయి, ఒక రకం గుర్రానికీ ఉంటాయి. బారెడేసి చుక్కలు చిరుత పులికీ ఉంటాయి; జిరాఫీకీ ఉంటాయి ఎందుకు? పులులకి చంపడానికీ, గుర్రానికీ, జిరాఫీకి దొరకకుండా పారిపోవడానికీను.



చారల గుర్రం

చారల గుర్రం బారెడెత్తున గడ్డిపెరిగే ప్రాంతాలలో తిరుగుతూ ఉంటుంది. పెద్దపులీ అంతే ఎరకోసం వెదురుపొదలో పొంచిఉంటుంది. ఎత్తుగా ఏపుగా పెరిగే గడ్డి దుబ్బుల మధ్య చారల గుర్రం ఉందనుకోండి ఆ గడ్డినీడలు దాని మీద పడతాయి. దూరంనించి చూచినపుడు వాటి వెనక ఉన్న గుర్రం వంటిమీది చారలూ వాటి పక్కన పడే గడ్డిముక్కల నీడలూ కలిసిపోయి అక్కడ తనకోసం తాయిలం ఉందన్న సంగతి పులికి తెలియదు చారల గుర్రం సరదాగా తిరుగుతున్నపుడు కూడా ఇందువల్లనే టోకరా తింటుంది తనని కాపాడిన గడ్డినీడలే పులి మీదా పడి దాని చారలతో కలసి ఉండడంతో, తనని ఆరగించడానికి సిద్ధంగా ఒక పెద్ద పులి ఉన్నట్లు దానికి తెలియదు. అందుకని యాదాలాపంగా నాలుగడుగులు వేస్తుంది. పొంచివున్న పులి అమాంతం మీద పడుతుంది. జిరాఫీ కథా ఇదే. జిరాఫీ చెట్లక్రింద తిరుగుతున్నపుడు దానిమీద ఆకుల నీడలు బారెడేసి పడతాయి. స్వతహాగా ఉండే చుక్కలూ ఈ నీడలూ కలిస్తే అది అక్కడ ఉన్నట్టు చటుక్కున తెలియదు. పొంచి ఉండే చిరుత పులికీ అంతే దానివీపుమీది చుక్కలే రహస్యం కాపాడుతాయి



పెద్ద పులి

ఇదంతా ఒకరి ఉనికి ఒకరికి తెలియక పోయినపుడే. చెట్లూ దుబ్బులూ లేని ఆరుబయట అనుకోకుండా పులీ జిరాఫీ పులీ చారలగుర్రం ఎదురుపడితే ఏ బెంగా లేదు. అది పరుగు లంకించుకుంటే పులి విమానం ఎక్కి వెళ్ళినా అందుకోలేదు.



జిరాఫీ

## బారెడేసి చారలూ, చారెడేసి మచ్చలూ

వింధ్యారణ్యంలో ఒక వెన్నెల రాత్రి తమాషా జరిగింది. ఒక పెద్ద పులి పొదమాటున పొంచి కూర్చుంది "ఎవరొస్తా రెవరొస్తా రెవరొస్తా రమ్మా" అనుకుంటూ.

ఆ పొదకి దగ్గర ఉన్న ఒక చెట్టు కొమ్మమీదనించి ఒక చిరుతపులి కూడా అలాగే పాడుకుంటూ నెమ్మదిగా వస్తోంది. వీరు వారినీ వారు వీరినీ చూడలేదు—నీడల మూలాన. అంతలో ఒక లేడి వ రా కు గా వచ్చింది.

పొదలోంచి పెద్దపులి, చెట్టు మీదనించి చిరతపులీ లంఘించాయి. లేడి హడలిపోయి ఒక్కడుగు వెనక్కివేసింది. దాంతో పెద్దలిద్దరు ఎదురుబొదురుగా నిలిచారు. ఈ లేడి నాదంటే నాదని వాదించుకున్నారు వాదన తెగక పోట్లాడుకోవడం మొదలుపెట్టారు. పెద్దపులీ చిరుతపులీ పోట్లాడితే ఏది గెలుస్తుందో చూడాలని ఆ లేడికి చాల కాలంనించి సరదా ఉంది. ఇంత వరకూ ఏ లేడీ చూడలేదు కూడా.

కాస్సేపు చూసి, సరదాలమాట దేవుడెరుగులే అనుకుని, లేడి శరవేగంతో పరుగు లంకించుకుంది. ★

## కుక్క విశ్వాసం

(48-వ పేజీ తరువాయి)

"నీ మెడలో ఒక తాడు కట్టి రెండవకొస నేను పుచ్చుకుంటాను. నన్ను అక్కడికి యిక్కడికి తీసుకొని వెళ్లు. నిన్ను చాలజాగ్రత్తగా చూచుకుంటాను" అని ధైర్యం చెప్పాడు.

ఎగిరి గంతులేసి సరే నన్నది చుంచుపిల్ల.

అంటూండగానే చుంచుపిల్లకు కంటిచూపు వచ్చింది. దాని మెడలో తాడుకట్టి రెండవకొస పట్టుకున్నాడు. ముందు చుంచు వెనక తాడుపట్టుకొని గ్రుడ్డివాడు ఆ యిల్లువిడిచి రోడ్డుమీదకు తప్పటడుగులు వేసుకుంటూ నడుస్తున్నాడు.

ఇదంతా సీతా, లలితా, కుక్క, పిల్లి వరండాలో నిలుచుని చూస్తున్నారు.

రోడ్డుమీద తప్పటడుగులతో తడుముకుంటూ దారిసరిగా తెలియక రాళ్లు కొట్టుకొని పడబోతూ మళ్లీ తమాయించుకొని తంటాలు పడుతున్నాడు అతను.

ఇదంతా చూస్తూ సీతా, లలితా జాలిపడ్డారు.

కాని ఎంతో కాలం నేస్తంగా వున్న కుక్కకు ఎక్కడలేని ఏడుపు వస్తున్నది. అంతకుముందు తనను పెట్టిన బాధలన్నీ మర్చిపోయింది. ఒక్క గంతులో ఆ గ్రుడ్డివాని దగ్గరకు వెళ్లింది. మళ్లీ వెనకటి నేస్తాలు. ఏడుస్తూ, గొంతు బొంగురుపోయేటట్లు కేకలు పెట్టారు ఆ పిల్లలు. కాని లాభంలేదు. కుక్క విశ్వాసం అలాంటిది. ★

---

54-వ పేజీలోని ప్రశ్నలకు జవాబులు

(1) జవాబు: రైల్వే టిక్కెట్టు.

(2) జవాబు: 2 మైళ్లు. తర్వాత బయటకు రావటం మొదలుపెట్టుతుంది.

---

Printed and Published for Nageswara Rao Estates Ltd., by S. Radha Krishna at The Andhra Patrika Press, 6 & 7, Tambu Chetty Street, Madras-1. Editor S. Sambhu Prasad.



దేవాలయ దీపం

—ఫొటో : ఎన్. రామకృష్ణ.

# "నా ప్రియమైన పరిమళం!"

అని సావిత్రి చెప్పుచున్నది

"లక్స్ టాయ్‌లెట్ సబ్బుయొక్క కొత్తసువాసనే నిజంగా మనోహరమైనది. అది శరీరంపై చాలాసేపు నిలవుండును."



శుద్ధమైన తెల్లని లక్స్ టాయ్‌లెట్ సబ్బుయొక్క అమోఘమైన సువాసనగల నురగ ప్రపంచంలో మిక్కిలి మెచ్చుకోబడిన సొగసైనవనితల చర్మమును నూతనంగాను, మృదువుగాను మరియు సౌందర్యంగాను ఉంచును.




పెద్దసైజు బిళ్లతో ప్రతిరోజూ సౌందర్యము నిచ్చు స్నానముచేసి ఆనందించండి

## లక్స్ టాయ్‌లెట్ సబ్బు

సినీమా తారలకు సౌందర్యమునిచ్చు సబ్బు

LTS. 461-X52 TL